Photo by N. Ramakrishna



బహుమతి
పొందిన వ్యాఖ్య

వెన్నెలలో మాట

పంపినవారు :
ఎల్. శివరావు - కలెవరం

త్వరలో
విడుదల!

సాహిణీ వారి

# అమరసందేశం

శ్రీరంజని..పద్మిని
అమరనాథ్..రేలంగి
మోహన్..మిక్కిలినేని



స్టూడియో: వాహిని

నిర్మాతలు... యస్. భావనారాయణ & డి.బి. నారాయణ

డిస్ట్రిబ్యూటర్లు:

| | | |
|---|---|---|
| ఆంధ్రదేశం | నైజాం | మైసూరు |
| నవయుగ ఫిలిమ్సు: | ఆల్ ఇండియా ఫిలిం కార్పొరేషన్ లి. | ది కర్నాటక ఫిలిమ్స్ లి. |
| విజయవాడ & గుంతకల్ | సికింద్రాబాద్ | బెంగళూరు |

వివరములకు: ది ఫిలిమ్స్ ఫైనాన్స్ కార్పొరేషన్., బార్న్‌బీ రోడ్డు, మదరాసు - 10.

## ఈ సంచికలో కథలు

## వింతలు - విశేషాలు







ఇవిగాక - రంగులబొమ్మ కథ, ఫోటోశీర్షికల పోటీ - మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు













HAMAM
TOILET SOAP

విజ్ఞానముతో
వినోదము

★

పిన్నలు, పెద్దలు
చదువతగిన శైలిలో
సచిత్ర కథలు

★

అతి ఆకర్షణీయమైన
సరికొత్త తీరులో
ముఖ చిత్రం

★

మూడు రంగుల
బొమ్మల కథలు

★

ఇన్ని ఆకర్షణలతో
వెల మామూలు
**6** అణాలే

★

సంవత్సర చందా
రు. **4-8-0**

★

నేడే చందాదారులుగా
చేరండి

# చందమామ

## దీపావళి ప్రత్యేక సంచిక

(నవంబరు 1954)

* రెట్టింపు పేజీలతో, భారతదేశమందలి ఏడు ప్రధాన భాషలలో ప్రకటింపబడుతున్నది.
* మద్రాసు, ఆంధ్ర, మధ్యభారత్, బీహార్ ప్రభుత్వములచే పాఠశాలలకు, గ్రంథాలయములకు ఆమోదింపబడినది.
* హిగిన్బాదమ్స్, ఎ. హెచ్. హ్వీలర్, స్వదేశమిత్రన్, గులాబ్‌సింగ్ - వారి రెయిల్వే బుక్‌స్టాల్సు అన్నిటిలోను దొరకును.
* 2750 లకు పైగా ఏజంట్లు
* 15,800 లకు మించి చందాదారులు
* 2,00,000 లు ప్రతులకుపైగా ప్రతినెల ముద్రణ
* 10,00,000 లకు మించి పాఠకులు భారతదేశమంతట కలరు.

మీ వ్యాపార ప్రకటనలు అందించటానికి ఇది ఒక గొప్ప శక్తివంతమైన సాధనమని ఈ వివరాలు తెల్పుతున్నవి.

## నేడే మీ ప్రకటనను పంపండి

అడ్వర్టయిజ్‌మెంట్ మేనేజర్ :

## చందమామ పబ్లికేషన్స్

మదరాసు - **26**

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

జీవితంలో విజయం సాధించి తరించాలంటే, ముందు విశ్వాసం కుదరాలి. దానినిబట్టి మానవ యత్నం చేయాలి. ఆ చేయటంలో కార్యదీక్ష పూని, పూర్తిగా నెరవెరేవరకూ సాధించితీరాలి. ఇది జరిగి నప్పుడే మానవుని శ్రమ సార్థకమవుతుంది. విశ్వాసం ఏపాటి సడలినా, యత్నంలో ఏమాత్రం దీక్ష తగ్గినా, అంతా వ్యర్థమే అవుతుంది. మానవునికి అతిముఖ్య మైన ఈ గొప్ప సమస్యను, మనసుకు పట్టేటట్టు నిరూపిస్తున్నది-ఈ సంచికలోని 'తప్పిపోయిన సిరి' అనే చిన్నకథ. కథలోని మందరుడు ఫలం వాంఛించకుండా పనిచేసినంతసేపూ చక్కగా నెర వేర్చగలిగాడు. ఫలంకోసం ఎదురుచూడగానే పనిలో విసుగు కలిగింది, విశ్వాసం తగ్గింది, శ్రమ వృథా అయింది. కనుక, మంచిదని తోచిన పనిని, ఫలం ఆశించకుండా సాగించటమే మానవుని విధి. ప్రతిదేశం లోనూ మహాగ్రంథాలన్నీ ఈ సత్యాన్నే బోధిస్తున్నాయి.



సంపుటి 15 : అక్టోబర్ 1954 : సంచిక 4



# టోపీ

మామిడివరమను గ్రామమందున
మాధవుడను నొక కుర్రాడు!
శ్రీనివాసుడను చిన్నవానితో
షికారు వెళ్ళెను ఒకనాడు!
మామిడివరము మామిడిపండ్లకు
మంచిపేరునే గాంచినది!
దారిపొడుగునా దోరపండ్లు నో
రూరించినవి ఇరువురకు!
కానీ కావలి కంచాలయ్యా
పొంచియుండె నా కంచెలలో!





మాధవుడప్పుడు మాంచి "ప్లాను"తో
కంచెవద్దనే పొంచాడు.
కంచాలయ్యను అంచుకు బిలిచి
మంచితనముతో చెప్పాడు—
"శ్రీనివాసుడు చెట్టునెక్కుటకు
సిద్ధము అదుగో" అన్నాడు.
దొరికినావురా దొంగదొంగ యని
తరుముకొనెను కంచాలయ్యా—
మాధవుడపుడు మాంచి సమయమని
మామిడిపళ్ళను కోశాడు.
సంచికి నింపి కంచెకావల
నుంచినాడు ఒక పొదరింట.
మాసూలెత్తిన మస్తానప్పుడు
మామిడితోటకు వస్తూనే—,






కంచెకవతల సంచిని దాచే
వంచకు బాలుని గన్నాడు.
మెల్లగ వెళ్ళి పళ్ళనంతయు
చల్లగ బైటకు తీశాడు—
నల్లరాళ్ళను కొల్లగ వేసి
మళ్ళీ సంచిని కట్టాడు—
కదలక మెదలక పొదలో దాగి
కథ చూద్దామని యున్నాడు!
గసలు పోసుకొని కంచాలయ్య
విసిగిపోయి అటు వచ్చాడు.
'దొరకలేదు ఆ దొంగవెధవ' యని
దొరపండ్లు రెండిచ్చాడు.
సంచి మోసికొని మాధవు డొకచో
టుంచి అచట గూర్చున్నాడు!



* * *

శ్రీనివాసుడు రాగా మురియుచు
పురిని విప్పి మరి చూశారు!
సంచినిండుకూ ఎంచివేసినవి
మంచిమంచి గుండ్రాళ్ళన్నా!
"మాకీ టోపీ మీకీ కాదు
మీకీ టోపి ఏస్కొండి"
కదలెను అంటూ పొదలో మస్తాన్
గడ్డాం చూచి ఇద్దరును—
పరుగో పరుగని ఉరుకో ఉరుకని
ఊరివైపునకు ఉరికారు.



## అట్టమీది బొమ్మ

క్రిందటిసారి పరశురాముని పితృభక్తిని గురించి తెలుసుకొన్నాముకదా! ఈ కథ అంతటితో ముగియలేదు. పరశురాముని తండ్రి ఐన జమదగ్నిమహర్షి తన కోపమువలన ఎంతటి ఘోరమైన కీడుమూడిందో గ్రహించి, పశ్చాత్తాపం పొంది, అప్పటినుంచీ పరమ శాంతుడయ్యాడు.

ఒకనాడు—హైహయరాజు ఐన కార్తవీరార్జునుడు వేటకు వచ్చి, పరివారంతోసహా జమదగ్ని ఆశ్రమం చేరుకొన్నాడు. అప్పుడు పరశురాముడు సమిధలకోసం అడవికి పోయివున్నాడు. జమదగ్ని, తన హోమధేనువు సహాయంతో రాజుకూ పరివారానికీ దివ్యమైన అతిథిసత్కారం చేశాడు.

ఐతే, రాజు కృతజ్ఞత చూపలేదు సరిగదా పైగా, ఆ హోమధేనువును జమదగ్ని ఆశ్రమంనుంచి బలవంతంగా తనవెంట లాక్కుపోయాడు. కొంత సేపటికి పరశురాముడు వచ్చి జరిగిన దౌర్జన్యం గ్రహించాడు. కోపావేశంతో పోయి, కార్తవీరార్జునుణ్ణి మధ్యతోవలోనే ఎదుర్కొని, అతనినీ పరివారాన్నీ తన పరశువుతో వధించాడు. తన తండ్రిదైన హోమధేనువును మళ్ళీ ఆశ్రమానికి తీసుకువచ్చాడు.

కార్తవీరార్జునుడికి నూరుగురు కుమారులు. వారు తండ్రిని మించిన క్రూరులు. పరశురాముణ్ణి ఎదుర్కొనేందుకు ధైర్యంచాలక, అతడు ఆశ్రమంలో లేని సమయమందు వారు వచ్చి, తపోనిష్ఠలో వున్న జమదగ్నిని చంపివేశారు.

పరశురాముడు వచ్చి, దుఃఖిస్తూవున్న తల్లిని చూచాడు. నిజం తెలుసుకొన్నాడు. 'క్షత్రియులు దురహంకార పూరితులై వున్నారు. వారి వంశమే లేకుండా నిర్మూలించి, లోకానికి వాళ్ళ పీడ వదిలిస్తాను,' అని ప్రతిజ్ఞపట్టాడు.

ఈ ప్రతిజ్ఞ నెరవేరటంకోసమే పరశురాముడు, కార్తవీరార్జునుడి కుమారులందరినీ చంపివేశాడు. క్షత్రియులమీద పగబట్టి ఇరవైయ్యొక్కసారులు భూప్రదక్షిణంచేసి, క్షత్రియుల రక్తంతోనే తన పితరులకు తర్పణం విడిచాడు.

ఇంతపని చేసినతరువాత పరశురాముడు శాంతించి, క్షత్రియులనుంచి తను స్వాధీనపరుచుకొన్న భూమిని బ్రాహ్మణులకు దానంచేసి, మహేంద్ర పర్వతంపైన తపస్సు చేసుకోబోయాడు.



# ఎవరిది పాపం?

అనగా అనగా కౌశికుడు అనే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అయన చాలా ఉత్తముడూ, దైవభక్తిపరాయణుడున్నూ.

ఒకరోజున కౌశికుడు ఒక పండితుణ్ణి విందుకు పిలిచాడు. పండితుడు సమ్మతించాడు. కౌశికుడు తమకు వాడుకగా పాలూ పెరుగూ తెచ్చే పాలమనిషిని పిలిచి, 'అమ్మీ! రేపు గట్టిగా తోడుపెట్టిన పెరుగు తెచ్చావంటే, మామూలుకంటే, ఎక్కువ డబ్బు లిస్తాను' అని చెప్పాడు.

పాలమనిషి కల్తీలేని గట్టిపెరుగు తోడు పెట్టి, ఆ ముంత భద్రంగా గంపలో పెట్టుకొని మరునాడు ఉదయం బ్రాహ్మడి ఇంటికి బయలుదేరింది. ఆమె గబగబ నడుస్తూ ఉండగా, గాలి విసురుకు పెరుగుముంత మీది గుడ్డ కాస్తా తొలగిపోయింది.

ఇదే సమయంలో ఒక గరుడపక్షి త్రాచుపాము నొకదానిని కాళ్లతో పట్టుకుని ఆకాశ మార్గాన ఎగిరిపోతూవుంది. బాధతో గిలగిల కొట్టుకొంటూన్న ఆ త్రాచుపాము విషం కక్కింది. ఆ విషం సరాసరి పాలమనిషి నెత్తిన వున్న పెరుగుముంతలో వచ్చిపడింది.

పాలమనిషి తిన్నగా కౌశికుని ఇంటికి వెళ్ళి, పెరుగుముంత ఇచ్చేసి, చక్కాపోయింది. కౌశికుడు ముంత పట్టుకపోయి జాగర్త పెట్టుకొన్నాడు.

విందు సమయమయింది. వేళకు పండితుడు వచ్చాడు. పదార్థాలన్నీ చాలా రుచిగా ఉండటంచేత, సుష్టుగా భోజనంచేశాడు. చివరకు ప్రత్యేకించి తోడుపెట్టించిన ఆ ముంతలో వుండే గట్టిపెరుగు తెచ్చి

'రవికిరణ్'




బ్రాహ్మణుడు ఆనందంతో వడ్డించాడు. పండితుడు ఆప్యాయంతో ఆరగించాడు.

ఐతే—భోజనమైన కొంచెం సేపటిలోనే పండితుడు గిలగిల తన్నుకొని ప్రాణాలు విడిచాడు. జరిగిన సంగతి ఏమిటో ఎవరికి మాత్రం ఏం తెలుసు? ఏదో అకస్మికంగా వ్యాధివచ్చి ఇలా జరిగిందనుకొని, కౌశికుడు ఎంతగానో విచారించాడు.

భూలోకంలో ఇలా పండితుడు మరణించగానే నరకలోకంలో లెక్కలు వ్రాసే చిత్రగుప్తుడికి చిక్కు వచ్చింది. పండితుడిని చంపిన పాపం ఎవరికి చెందుతుంది? అనే సమస్యతో అతను తికమకలుపడసాగాడు.



'పండితుడికి భోజనం పెట్టినవాడు బ్రాహ్మణుడు. కనుక, ఈ పాపం అతనిదే' అనుకొన్నాడు. కాని, వెంటనే ఈ అభిప్రాయం మారిపోయింది. 'మంచి గట్టి పెరుగు తెప్పించి, పండితుడికి తృప్తిగా విందుచేస్తున్నాంకదా అని ఉత్సాహంతో వడ్డించాడు కాని, పెరుగుముంతలో పాము విషం కక్కిన సంగతి అతనికేం తెలుసు? తెలిసివుంటే వడ్డించడుకదా? బ్రాహ్మణుడు కేవలం నిర్దోషి. పాపం అతనికి అంటదు' అని తర్కించుకొన్నాడు.

'పోనీ, పెరుగు తెచ్చిన పాలమనిషిది తప్పా? ఊహుఁ, గంపమీద గుడ్డ ఎగిరిపోవడంకాని, ముంతలో పాము విషం పడడంకాని, ఏదీ తెలియదు ఆమెకు. అందుచేత పాలమనిషికీ పాపము చెందదు' అని నిశ్చయించుకొన్నాడు.

'ఐతే, ముంతమీదినుంచి గుడ్డ తొలగకుంటే, పాము కక్కిన విషం పెరుగులో కలియటం, పండితుడు చనిపోవటం జరగదుకదా. కనుక, గుడ్డను తొలగించిన వాయుదేవునిదా ఈ తప్పు?' అని మళ్ళీ ప్రశ్నవచ్చింది. 'కాదు. గాలి వీచకుంటే ప్రాణికోటి బ్రతికేది ఎట్లా? వాయుదేవుడికి వీచటం సహజగుణం. వాయుదేవుడి తప్పు

ఇందులో కొంచెమైనా లేదు' అని చిత్రగుప్తుడు తీర్మానించుకొన్నాడు.

పోతే—విషం కక్కిన పాముకి చెందుతుందా ఈ పాపం? అదీ సమంజసంగా కనబడలేదు. గరుడపక్షి తనను గోళ్ళతో నొక్కిపట్టుతూవుంటే బాధ భరించలేక, ప్రాణంపోయే సమయంలో అది విషం కక్కింది. ఆ విషం ఎక్కడ పడుతుందో దానికేం తెలుసు? విషం పోయి సరీగా పెరుగుముంతలోనే పడుతుందని పాము కలగన్నదా? కాబట్టి పాముని తప్పు పట్టటానికి వీలు కనిపించలేదు.

ఇక మిగిలిందల్లా గరుడపక్షి. దాని ఆహారంకోసం అది తాపత్రయపడి, పామును పట్టుకుంది కాని, తక్కిన గొడవంతా దానికేంతెలుసు? ఇంతకూ, పెరుగు ముంతలోనే విషం కక్కమని అదేం పామును నిర్బంధించలేదే? అందుచేత గరుడపక్షి పూర్తిగా నిరపరాధి.

ఏ విధంగా చూచినా, ఇందులో ఎవరినీ తప్పుపట్టటానికి వీలులేకుండావుంది. ఈ విషయం ఏమీ తేల్చుకోలేక చిత్రగుప్తుడు యమధర్మరాజువద్దకు పోయి, సలహా చెప్పమని కోరాడు. యమధర్మరాజుకూ ఏమీ తోచక, అక్కడ వున్న ధర్మశాస్త్రవేత్తలను




అడిగాడు. వారూ ధర్మం నిర్ణయించలేకపోయారు.

యముడు తిన్నగా విష్ణువుదగ్గరకు పోయి విన్నవించాడు. విష్ణువుకీ పాలుపోయింది కాదు. సభ చేశాడు. ఎవరూ ధర్మనిర్ధారణ చేయలేకపోయారు. అప్పుడు యముడు చిత్రగుప్తుడితో 'ఇది ఇలా తేలే విషయంకాదు. నేను మళ్లీ చెప్పేవరకూ ఈ పాపం ఎవరికి చెందినట్టూ లెక్క రాయవద్దు,' అన్నాడు.

ఇలా అని యముడు తన భటులను భూలోకానికి పంపించాడు. ఒకనాడు ఇద్దరు బ్రాహ్మణులు ఒక చెట్టుకింద విశ్రాంతి తీసుకొంటున్నారు. అందులో ఒకనికి పక్షి



భాష వచ్చును. ఆ చెట్టుమీదవున్న పక్షి దంపతులు ఆరోజున తాము గరుడునివల్ల విన్న వృత్తాంతాలు—కౌశికుడు పండితుడికి విందుచేయటం, పండితుడు చనిపోవటం, ఇందునుగురించి యముడు తిప్పలుపడటం- చెప్పుకొంటున్నయి. ఇదంతా వింటున్న ఆ బ్రాహ్మణుడు సంగతి అంతా రెండవ వానికిచెప్పి, 'దీనికే ఇంత బ్రహ్మండమా? నన్నడిగితే తీర్పు చెప్పేవాడిని. వస్తుపరీక్ష చేయకుండా అతిథికి వడ్డించటంచేతనే పండితుడు మరణించాడు. ఈ పాపం కౌశికుడిదే!" అన్నాడు.

ఆ సమయంలో భూలోకానికి దిగివస్తున్న యమకింకరులు ఈ మాటలువిని, ఆ బ్రాహ్మణుడిని యమధర్మరాజు ఎదుటకు లాక్కుపోయారు. 'ఈ మాటలు నీవు అన్నావా, లేదా?' అని యముడు బ్రాహ్మణుణ్ణి అడిగాడు. 'అన్నాను' అని నిర్భయంగా చెప్పాడు బ్రాహ్మణుడు.

అప్పుడు యమధర్మరాజు రెండు కుండల పెరుగు తెప్పించాడు. అందులో ఒకదానిలో రహస్యంగా విషం కలిపించి, బ్రాహ్మణుడిముందు పెట్టించాడు. 'బ్రాహ్మడా! ఈ రెండు కుండలలోనూ దేనిలో విషం కలిసివుందో చెప్పు' అన్నాడు.

బ్రాహ్మణుడు తెల్లబోయాడు. ఆ రెండు కుండల్లో, ఏది విషంకలిసినదో తెలుసుకోవాలంటే, తను ముందుగా రుచిచూచి పరీక్షించాలి. ఒకవేళ అది విషం కలిసిన పెరుగుకుండ అయితే తను మరణిస్తాడు.

అప్పుడు యముడు కోపించి, 'బ్రాహ్మడా! నీకు తెలియనప్పుడు తెలియనట్టు ఉండక, పరులమీద నిందలాడావు. అందుచేత, పండితుడిని చంపిన పాపం నీకే చెందుతుంది' అని చెప్పి, అతనిపేరు చిత్రగుప్తుడిచేత లెక్కలలో వ్రాయించాడు. ఎవరికీ చెందని పాపం నిష్కారణంగా ఆ బ్రాహ్మణుడికి అంటుకొన్నది.





# చీనాంబరాలు

మూడు వేల సంవత్సరాలక్రితం చీనా చక్రవర్తి ఒక అందమైన అమ్మాయిని పెళ్ళాడాడు. ఆమెపేరు సీలింగ్‌షీ. ఆమె వయస్సు పధ్నాలుగేళ్ళు. చీనాచక్రవర్తికి పట్టపు రాణిఅయిన సీలింగ్‌షీకి ఏ లోటూ లేదు. రోజల్లా ఆమెకు వినోదం కలిగించటానికి గాయకులూ, నర్తకులూ ఉండేవారు. ఏమి కావలిసినా చేయటానికి పరిచారికలు వుండేవారు.

కాని ఇన్నీ ఉండికూడా సీలింగ్‌షీకి పెద్దవిచారం పట్టుకున్నది. ఆమె కళ్ళవెంట నిరంతరం అశ్రుధారలు కారసాగాయి. ఆమె దుఃఖాన్ని బాపటానికి ఎందరో యత్నించారు. కాని లాభం లేకపోయింది. ఆమె దుఃఖానికి కారణమేమంటే, ఆమె ఎన్నడూ తన పుట్టింటివారిని విడిచి ఉండి నది కాదు. అందులోనూ చిన్నపిల్ల. దూరాన ఉన్న తన తలిదండ్రులనూ, అన్నదమ్ములనూ తలుచుకుని ఆమె ఎల్లవేళలా కుమిలిపోసాగింది.

తన పట్టమహిషి చింతాక్రాంతురాలైఉన్న దన్నవార్త చక్రవర్తికి తెలిసి, తన ఇద్దరు మంత్రులతోసహా ఉద్యానవనానికి వచ్చాడు. తోటలో కంబళీవృక్షంనీడను కూర్చొనిఉన్న తన భార్యను సమీపించి, "రాణీ, నీకేమి లోటు జరిగింది? నీ లేతబుగ్గలు తడిగా ఉన్నాయి దేనికి? నీ ఆరోగ్యం బాగాలేదా? దాచక చెప్పవలసింది," అని అడిగాడు.

"స్వామీ నాకే లోటూలేదు. మీరు విచారించకండి. నామనసుకు ఉల్లాసంగాలేదు. అంతకంటె మరేమీలేదు," అన్నది సీలింగ్‌షీ.

మహారాజు తన మంత్రులకేసి చూసి, "మీరు త్వరలోనే మహారాణి మనసుకు ఉల్లాసం కలిగించే యోచనలు చేయండి." అని వెళ్ళిపోయాడు.

ఆర్. చలపతిరావు




తమలో తాము మాట్లాడుకుంటూ మంత్రులుకూడా వెళ్ళిపోయారు.

ఇంతలోనే పరిచారికలు తేనీరు తెచ్చి మహారాణి ముందుపెట్టారు. ఆమె ఆచారం ప్రకారం తానే స్వయంగా తేనీరు గిన్నెలలో కలిపి పాటగాళ్ళకూ, ఆటగాళ్ళకూ ఇచ్చి తన గిన్నె ముందుంచుకున్నది. తేనీరు చాలా వేడిగా ఉండటంచేతనో, దానిమీద అంతగా ఇచ్ఛకలగకనో ఆమె దానిని వెంటనే తాగలేదు.

ఈ సమయంలో కంబళీవృక్షంమీద నుంచి ఏదో వస్తువు మహారాణి తేనీటి గిన్నెలో టప్‌మని పడింది. తేనీరు చింది అమూల్యమైన మహారాణి దుస్తులపై పడింది. పరిచారికలు నొచ్చుకుంటూ ఆమెను సమీపించబోయారు.

"నాదుస్తులకేమీ తొందరలేదు. గిన్నెలో పడిన వస్తువేమిటో చూడండి," అన్నది మహారాణి.

పరిచారికలు గిన్నెలోని తేనీటినుంచి చిన్న దారపు ఉండలాటి పదార్థాన్ని తీసి మహారాణి చేతిలో పెట్టారు. అది మరేమీ కాదు, పట్టుపురుగులు కంబళీ వృక్షాలమీద పెట్టే గుడ్డు తాలూకు పిసినికాయ. అలాటి పిసినికాయలు కంబళీవృక్షంమీద ఇంకా అనేకం ఉన్నాయి.

తేనీటిలో పడిన పిసినికాయను పరిచారికల వద్దనుండి తన చేతిలోకి తీసుకొనే సమయాన సీలింగ్‌షీ ఒక వింత గమనించింది. ఆ పిసినికాయ విచ్చుకుని అతి సన్నని, నిగనిగలాడే పోగులు చేతిలోకి రాసాగాయి.

"ఆహా! ఇదే దారమైతే దీనితో నేసిన వస్త్రాలు ఎంత అందంగా ఉండాలి!" అనుకున్నది సీలింగ్‌షీ. మరుక్షణమే ఆమెకొక ఆలోచన తట్టింది. ఈ పోగులు మరీ సన్నగా ఉన్నమాట నిజమేగాని ఇవి సులువుగా తెగటంలేదు. అదీగాక ఈ ఒక్క



పిసినికాయలోనే ఎన్నో వేల గజాల పోగులు వున్నట్టు కనిపిస్తున్నది. ఈ పోగును అనేక పేటలువేసి పేనినట్టయితే దారం తయారవుతుంది. అప్పుడు దానిని మగ్గంమీద నేసి, ప్రపంచంలో ఎవరూ ఎన్నడూ చూడనంత అందమైన బట్టలు తయారుచేయవచ్చు.

ఈ ఆలోచన రాగానే మహారాణి మనోవ్యాధి కాస్తా మటుమాయమయింది. ఆమె ఉత్సాహంతో లేచి తన పరిచారికలను పిలిచి తన చేతిలోవున్న పోగును విప్పదీసి, పేటలువేసి పేనమని చెప్పింది. వారలాగే సన్నని, నిగనిగలాడే దారం పేని పుల్లలకు చుట్టసాగారు.

"ఇట్లా ఎంత దారమైతే ఒక బట్టకాను? మీరంతా కలిసి చెట్టుమీదవున్న పిసినికాయలన్నీ ఏరి తెచ్చి తేనీటిలో వెయ్యండి," అన్నది మహారాణి.

ఎవరికీ క్షణం తీరిక లేదు. అదివరకు పనీపాటలు లేక క్షణమొక యుగంగా గడిచిన మహారాణికిప్పుడు ఘడియలు క్షణాలలాగా సాగిపోతున్నాయి. సూర్యాస్తమయే లోపల చాలా కండెల దారం తయారయింది. ఇంకా చేయవలిసిన పని బోలెడంత ఉన్నది. ఆమె వస్త్రంగులను పిలిపించి, "ఈ దారం చూడండి. ఇంత




సన్నని దారం నేయటానికి వెంటనే మగ్గం తయారుచేయండి. తెల్లవారేలోగా మగ్గం తయారయి నా గదిలో ఉండాలి," అని ఆజ్ఞాపించింది.

మర్నాడు చక్రవర్తి తన మంత్రులను పిలిపించి, "పట్టపురాణి మనసు ఉల్లాసంగా ఉండటానికి ఏమాలోచించారు?" అని అడిగాడు.

"చిత్తం, ప్రభూ! ఒక చక్కని నెమిలిని తెచ్చి మన ఉద్యానవనంలో వుంచినట్టయితే దేవిగారు దాని నాట్యం తిలకిస్తూ, దాని ఈకల రంగులుచూసి వినోదిస్తూ..." అని ఒక మంత్రి గొణిగాడు.



చక్రవర్తి రెండోమంత్రికేసి చూశాడు.

"మన ఉద్యానవనంలో జలక్రీడలకు చిన్న తామరకొలను ఏర్పాటుచేసినట్టయితే మహారాణిగారు అందులో ఈతలు కొడుతూ—" అన్నాడు రెండో మంత్రి.

తన ఇద్దరు మంత్రులకూ సరిఅయిన ఆలోచన తోచలేదని తెలుసుకుని చక్రవర్తి తన పట్టపురాణిని పిలవనాజ్ఞాపించాడు.

"ప్రభూ! మహారాణిగారింకా తమగది నుండి బయటికేరాలేదు," అన్నారు నౌకర్లు.

"ఇంత పొద్దెక్కి ఇంకా బయటికే రాలేదా ?" అన్నాడు చక్రవర్తి. అర్భకురాలైన తన ప్రియభార్య ఆరోగ్యం గురించి ఆయనకు ఆందోళన కలిగింది. ఆయన వెంటనే సింహాసనం దిగి సరాసరి రాణిగదికి వెళ్లాడు. చక్రవర్తి లోపల అడుగువేస్తూనే చూసిన దృశ్యం ఆయనకు ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగించింది.

మహారాణి విచారసాగరంలో మునిగి ఉండకపోగా, ఒక విచిత్రమైన మగ్గం ముందు కూచుని ఎన్నడూ కనని, విననంత అందమైన దారపు పోగులతో ధగధగ మెరిసే నాజూకైన వస్త్రం నేస్తున్నది.

మహారాణి తల ఎత్తి చక్రవర్తికేసి చూసింది. ఆమె కళ్ళు ఆనందంతో మెరుస్తున్నాయి. చిరునవ్వు నవ్వింది.



"మహాప్రభూ! నా విచారంతో మీకు బాధ కలిగించాను. దానికి పరిహారంగా మీకీ దేవతావస్త్రం నేసి ఇస్తున్నాను. అగ్ర హించరుకద?" అన్నదామె.

"అగ్రహమా? ఇంత అపూర్వమైన వస్త్రం బహుమతి పొందుతూ అగ్రహించ గలనా?" అన్నాడు చక్రవర్తి.

సీలింగ్‌షీ తన భర్తతో జరిగినదంతా చెప్పింది.

"తమ భార్యగా వుండి నేను పనిచెయ్యటం భావ్యంకాదు. అందుచేత ఈ సంగతి రహస్యంగా ఉంచాను" అన్నది మహారాణి.

"దానికి నాకేమీ విచారంలేదు. నీ మనసుకు తృప్తి కలిగించినవారికి అర్ధ రాజ్యం ఇవ్వటానికికూడా సిద్ధపడ్డాను. నీ విచారం తొలగిందే నాకు పదివేలు," అన్నాడు చక్రవర్తి.

"అయితే, మహాప్రభూ! నాకోరిక ఒకటి నెరవేర్చండి," అన్నది మహారాణి.

"నీయిష్టంవచ్చింది కోరుకో!" అన్నాడు చక్రవర్తి.

"వెయ్యి కంబళీవృక్షాలతో నాకొక తోట వేయించిపెట్టండి!" అన్నది మహారాణి. చక్రవర్తి ఆమె కోరిక నెరవేర్చాడు.

సీలింగ్‌షీ ప్రపంచంలో మొట్టమొదటి పట్టు వస్త్రాలు నేసింది. ఇప్పటికీ చీనా భాషలో 'సీ' అంటే పట్టు. ఆమె అనంతరం చీనాదేశపు మహారాణులు ఆమె ఏర్పాటుచేసిన సంప్రదాయాన్ననుసరించి, ఏటా ఒకరోజు పట్టుపురుగులకు తమ చేతి మీదుగా ఆహారం వేస్తూవచ్చారు.

కాలక్రమాన పట్టువస్త్రాల రహస్యం చీనానుంచి ఇతరదేశాలకు పాకింది. అందుకనే మన పూర్వీకులు పట్టువస్త్రాలను చీనాంబరాలనేవారు. మిగతా దేశాలలో పట్టువస్త్రాలు తయారయినాకూడా చీనా దేశపు పట్టువస్త్రాలకు గణ్యత ఉన్నది. వీటిని మనవారు చీని చీనాంబరాలనేవారు.






బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో ఒకప్పుడు బోధిసత్త్వుడు ఆస్థాన పురోహితుడుగా ఉండేవాడు. ఆయనకు నాలుగు వేదాలూ, ఆరుశాస్త్రాలూ, పద్దెనిమిది పురాణాలూ క్షుణ్ణంగా వచ్చు. పైగా లోకాన్ని వశ్యంచేసుకొనె అపూర్వమైన ఒక మహా మంత్రంకూడా ఆయన నేర్చాడు.

ఈ మహామంత్రం ఉచ్చరిద్దామనే ఉద్దేశంతో ఒకరోజున పురోహితుడు ఏకాంత స్థలంలో ఒక శిలావేదికమీద నిష్ఠగా కూర్చున్నాడు. ఆయన ఉచ్చరించిన మంత్రం అంతా, పక్కన బొరియలోఉండే ఒక మగనక్క విన్నది.

ఆనక్క సామాన్యమైంది కాదు. పూర్వ జన్మలో అది ఒక గొప్ప మంత్రవేత్త. ఏక సంథాగ్రాహికూడా. అందుచేత, ఒక్కసారి వినేటప్పటికి ఆ నక్కకు పురోహితుడు ఏకరుపెట్టిన మహామంత్రం కంఠతా వచ్చేసింది. వెంటనే అది తన బొరియనుంచి బయటపడి అడవికి వెళ్ళిపోయింది.

అడవిలోకి వెళ్ళిపోయిన ఆనక్క మహా మంత్రం పఠించి వందలకొద్దీ నక్కలను తన అధీనంలోకి రప్పించుకొన్నది. తరువాత అది మంత్ర ప్రభావంవల్ల అరణ్యంలో ఉండే ఏనుగులను, గుర్రాలను, సింహాలను, లేళ్ళను—ఒకటేమిటి, సమస్తమైన చతుష్పాత్తులనూ ఎదటికి రప్పించుకొన్నది.

జంతువులన్నీ వచ్చి సమావేశంకాగానే, ఆ నక్క 'ఈ క్షణంనుండి నేనే మీకు ప్రభువును. మీరందరూ ప్రభుభక్తి కలిగి వున్నారంటే--ముందు ముందు అనేక ఘన కార్యాలు సాధించవచ్చు. ఈనాటినుంచి నా పేరు 'శబ్దదత్తుడు' అని ప్రకటించింది.

ఆ మగనక్క పక్కనే ఆడనక్క రాణిగా కూర్చున్నది. రెండు ఏనుగులపైన ఒక సింహం నిలబడింది. ఆ సింహంపైన





రాణిగారితోసహా నక్కరాజుగారు ఆసీనులైనారు. జంతువర్గమంతా జేజేలు కొట్టింది. ఎంతో వైభవంగా పట్టాభిషేకం జరిగింది.

ఇప్పుడు ఈ పదవితో నక్కరాజుగారికి తృప్తిలేకపోయింది. చెప్పలేని గర్వం పట్టుకుంది. 'ఈ అడవిలో నోరులేని నాలుగుకాళ్ల జంతువులను లొంగదీసుకోవడం గొప్పయేముంది, కాశీరాజ్యం జయిస్తే ఘనత వుందిగానీ!' అని తలచింది. ఇటువంటి రాజ్యకాంక్షతో నక్కరాజు ఒకనాడు తన పరివారం అంతటినీ వెంటబెట్టుకొని కాశీ నగరంమీదికి దాడివెళ్ళింది.

నగరానికి సరిగా ఆమడ దూరంలో నక్కరాజు విడిసి, కాశీరాజుకు రాయబారం పంపాడు—'మీ రాజ్యం వదులుకొని మా వశంచేసినా సరే, మాతో యుద్ధంచేసి జయించినా సరే' అని.

ఈ వార్త చెవినిపడగానే కాశీనగర ప్రజలందరూ హడలిపోయారు. భీతాహంతో ఎవళ్ళమట్టుకు వాళ్ళు తలుపులు మూసుకొని ఇళ్ళలోపలే ఉండిపోయారు.

అప్పుడు ఆ సాన పురోహితుడుగా వుంటున్న బోధిసత్వుడు రాజువద్దకు వెళ్లి 'మహాప్రభూ!—మీరేమీ భయపడకండి. నక్కరాజు సంగతి నాకు వదిలేయండి. దాని పొగరు నేనణుస్తాను. దానిని లొంగదీయగల రహస్యం నాకు తప్ప మరెవ్వరికీ తెలియదుకూడా' అని మనవిచేశాడు.

తరవాత బోధిసత్వుడు ఒక కోటబురుజు మీద నిలబడి, 'ఓయీ శబ్దదత్తా!—నీవు మాపైకి దండెత్తిరావటం బాగానేవుంది. ఐతే, ఏవిధంగా మా రాజ్యాన్ని వశంచేసుకోదలిచావు?' అని నక్కరాజును అడిగాడు.

అందుకు నక్కరాజు 'దీనికేముంది!—మా సింహాలు గర్జిస్తాయి. మీ ప్రజలూ, సైనికులూ భయపడి పరుగులెత్తుతారు. అప్పుడు మేము కోట వశం చేసుకొంటాము' అని జవాబు చెప్పాడు.

ఈ మాటకు బోధిసత్త్వుడు—'అయ్యా, శబ్దదత్తా!—ఏమిటీ పిచ్చిపూహలు? మృగరాజు ఐన సింహం, నీవంటి ఒక ముసలి నక్క ఆజ్ఞకు లోబడి, నీవు గర్జించమంటే గర్జిస్తుందనుకొన్నావా?' అని పరిహాసం చేస్తూ అన్నాడు.

గర్వపోతు నక్కరాజు అహంకారంతో 'తప్పక సింహాలన్నీ నా ఆజ్ఞను శిరసా వహిస్తాయి. కావాలంటే ఇప్పుడు ఈ సింహాన్ని ఆజ్ఞాపించి మచ్చు చూపిస్తా' అన్నాడు కోపంగా.

'చూపించు, చేతనైతే!' అని రెట్టించాడు బోధిసత్త్వుడు.

తక్షణమే శబ్దదత్తుడు 'గర్జించు' అని సంజ్ఞచేస్తూ, తను ఎక్కి కూర్చున్న సింహాన్ని వీపుమీద కాలితో తన్నాడు. సింహం ముమ్మారు, భూమి దద్దరిల్లేటట్టు గర్జించింది. సింహాన్ని తమ వీపులమీద నిలబెట్టుకొన్న ఏనుగులు రెండూ భయపడి, విడిపోయినై. నక్కరాజుగారూ రాణీగారూ దభీమని కింద పడ్డారు. ఆ కంగారులో ఏనుగులు అటుయిటు పరుగెత్తుతూ నక్కరాజును కాళ్లతో తొక్కివేశాయి. నక్కరాజుగారు తుక్కుతుక్కు ఐ, చచ్చి పూరుకొన్నాడు.

ఆ గలభాలో ఏనుగులే కాదు, తక్కిన జంతువర్గమంతా ఒకదాని నొకటి కలియ దొక్కుకొని, చాలవరకు నాశమయినై. చావక మిగిలివున్న కొద్దిపాటి చతుష్పాత్తులు కొనప్రాణాలతో పారిపోయి అరణ్యం చేరుకొన్నాయి. కాశీనగరం ఇవతల నాలుగామడ మేర జంతువుల శవాలతో నిండిపోయింది!

అప్పుడు మళ్ళీ బోధిసత్త్వుడు చాటింపు వేయించాడు. ప్రజలందరూ తలుపులు తెరుచుకొని, క్షేమంగా బయటపడ్డారు. నాటి నుంచీ కాశీరాజ్య ప్రజలు జంతువులనుంచి ఎటువంటి భయమూ లేకుండా సుఖంగా ఉంటూ వచ్చారు.






## 10

[చతుర్నేత్రుడు తనకూ ఏకాకికీ వున్న బాల్యవిరోధం, సమరసేనుడికి తెలిపాడుకదా? ఇద్దరం ఒకే ఊరివాళ్లమనీ, ఒకనాడు ఒక లేడిపిల్లకోసం మేము తగూలాడామనీ చెప్పాడు. సింహం ఎదుర్కొగా, చెట్టుమీద దాక్కున్న తనను, పల్లెవాసులు 'దయ్యం' అనుకుని పారిపోవటం—తెల్పేసరికి, కొండకింద కోలాహలం వినబడింది. తరవాత—]

చతుర్నేత్రుడు, తనమీద ఏకాకి ప్రయోగించిన మాయోపాయాన్ని గురించి చెప్పేటంతలో కొండదిగువను పెద్ద కోలాహలం బయలుదేరింది. సమరసేనుడూ, సైనికులూ ఆ ధ్వని వచ్చినవేపు తలలు తిప్పారు.

అప్పటికి సూర్యాస్తమయం అయి కొద్దిసేపే అయింది. ఆ కొండప్రాంతం అంతా నల్లని చీకటి కమ్ముకుంటోంది. సమరసేనుడికి దూరంగా మనుషులు అరవటం తప్ప, వాళ్ళు ఎక్కడ వున్నదీ, ఎటుకేసి నడుస్తున్నదీ దృష్టిగోచరం కాలేదు.

అంతలో ఏకాకి మాంత్రికుడి కంచుకంఠం వినబడింది. 'కాలభుజంగా, కపాలా!' అని అరుస్తున్నాడు ఏకాకి.

చతుర్నేత్రుడు ఒక్క తృటికాలం అటుకేసి దృష్టిసారించి—"సమరసేనా! ఒక వైపునుంచి మీ కుండలినీ మనుషులు, రెండో వైపునుంచి ఏకాకీ వస్తున్నారు. నావా, నాగకన్య కథ తరవాత చెపుతాను. ముందు వాళ్ళ కంటబడకుండా తప్పుకుపోవటం అన్నివిధాలా మనకు క్షేమమైన పని," అన్నాడు.




సమరసేనుడికీ ఆ పరిస్థితుల్లో అంతకంటె చేయదగింది ఏమీ లేదనిపించింది. 'కుండలినీ మనుషులు' అనటంలోనే—వాళ్ళు ద్రోహి కుంభాండుడూ, వాడి నాయకత్వంకింద వున్న ఆటవికులూ అని సమరసేనుడికి అర్థమైపోయింది.

"అదుగో, వాళ్ళు యిటే వస్తున్నారు. కొండ ఎక్కుతున్నారు!" అంటూ చతుర్నేత్రుడు తన చూపుడువేలిని కొండదిగువ ప్రాంతానికేసి ఎత్తాడు. సమరసేనుడూ, సైనికులూ అటుకేసి చూశారు. దాదాపు నలభై యాభైమంది మనుషులు దివిటీలు పట్టుకొని అరుస్తూ కొండ ఎక్కుతున్నారు.



"ఇప్పుడు కర్తవ్యం ఏమిటి చతుర్నేత్రా?" అని అడిగాడు సమరసేనుడు. "ఆ ఒక్క కుంభాండుడినే అయితే, నావద్ద వున్న యీ ఐదుగురు సైనికులతోనే ఎదుర్కోగలను. సుశిక్షితులైన నా సైనికుల బాణాలధాటికి ఆ ఆటవికులు నిలబడలేరు. కాని యీ ఏకాకి సంగతి..."

"సరే, ఆ ఏకాకిపని నాకు వదులు," అన్నాడు చతుర్నేత్రుడు. "కాని, ఒక్క విషయం గుర్తుంచుకో. నువ్వు యిప్పుడే—యీ చీకట్లో కుంభాండుడిని ఎదుర్కోవటం అంత మంచిది కాదేమో. పైగా ఏకాకి కంటపడితే, నీవు చేయాలనుకున్న సంహారం అతడే చేస్తాడు."

చతుర్నేత్రుడి అంచనా నిజమని ధృవపడేందుకు ఎంతోకాలం పట్టలేదు. వుత్సాహంతో కేకలు వేస్తూ వస్తూన్న ఆటవికులనూ, ముందుండి నడుపుతూన్న కుంభాండుణ్ణీ ఏకాకి ఎదురై అటకాయించాడు.

"ఇదీ కథ! యీక్షణం ఎప్పుడొస్తుందా అని నేను చూస్తున్నాను," అంటూ సమరసేనుడు పట్టరాని సంతోషంతో అన్నాడు. కాని చతుర్నేత్రుడు తలపంకిస్తూ—

"సమరసేనా! తొందరపడి లేనిపోని ఆశలకు పోకు. ధనరాసులతో వున్న నావా,





నాగకన్య వృత్తాంతం నీకు సరిగా తెలియదు. వాటిని గురించిన నిగూఢరహస్యం ఆఖరికి నీకయినా నేను ముందుగా చెప్ప లేను. పైగా ఏకాకి వదరుబోతు అయినా, కేవలం బుద్ధిహీనుడు మాత్రం కాదు. ఆ కనబడే పెద్ద బండరాతివెనక దాక్కుందాం, పదండి," అన్నాడు.

చీకట్లో తడబడుతూ సమరసేనుడూ, సైనికులూ చతుర్నేత్రుడిని అనుసరించి నడిచారు. కొద్దిక్షణాల్లోనే వాళ్ళంతా కుంభాండుడు ఆటవికులతో వున్నచోటుకు దాపులనే ఒక పెద్ద రాతివెనక దాక్కున్నారు.

ఏకాకిని చూడగానే, కుంభాండుడు భయకంపితుడయ్యాడు. అతడి వెంట వస్తూన్న ఆటవికులు పారిపోయేందుకు తయారయేంతలో ఏకాకి పకపకనవ్వుతూ-

"మీరంతా వున్నచోటునుంచి కదిలారో మరణం తప్పదు. నాదృష్టిలో పడినప్రాణి, నా ఆజ్ఞ లేనిదే కదిలేందుకు వీలులేదు. కాలభుజంగా, కపాలా! వీళ్ళని చుట్టుముట్టండి," అంటూ ఆజ్ఞయిచ్చాడు.

వెంటనే కాలభుజంగం ముందుకుదూకి బుసలుకొడుతూ ఆటవికుల చుట్టూ తిరగసాగింది. కపాలం గాలిలో కదుల్తూ వాళ్ళ తలలపై ఆడసాగింది.






"మీరెవరు? ఈ ప్రయాణం ఎక్కడికి?" అని గర్జిస్తూ ప్రశ్నించాడు ఏకాకి.

ఆ ప్రశ్నతో కుంభాండుడు తత్తర పడ్డాడు. అతడికి నిజంచెప్పాలో, లేక అబద్ధంచెప్పి తప్పించుకోవచ్చో తెలిసింది కాదు. ఈ ద్వీపంలోవున్న మాంత్రికులను గురించి ఆటవికులద్వారా వినివున్నా, చూడటం యిదే మొదలు.

"నేను యీ ఆటవికులకు రాజును. నాపేరు కుంభాండుడు" అని మాత్రం చెప్పగలిగాడు కుంభాండుడు.

"మరి యీ ప్రయాణం?" అంటూ కన్నెర్రచేశాడు ఏకాకి.



ఇక నిజం చెప్పక తప్పదనిపించింది కుంభాండుడికి. ఒకవేళ తను నిజందాచినా, భయంతో వణికిపోతూన్న ఆటవికులు నిజం చెప్పక మానరు అనుకున్నాడు.

"ఈ కొండశిఖరం మీదినుంచి చూస్తే, సముద్రంలో ఒక నావ కనబడుతుందని విన్నాను. దానిని చూచేందుకు వెళ్తున్నాను." అన్నాడు కుంభాండుడు భయాన్ని అణచుకుంటూ.

ఈ మాటలకు ఏకాకి బిగ్గరగా నవ్వాడు. అతడికి యీ ఆటవికులూ, కుంభాండుడూ ఎక్కడికి, ఎందుకు వెళ్తున్నారో తెలుసు.

"ఈ చీకటిలో కేవలం నావను చూచేందుకు యీ కొండశిఖరం ఎక్కుతున్నావన్నమాట? ఆహాఁ-నీ తెలివితేటలు అమోఘం. నీకు యీ అనాగరిక ఆటవికుల మీద రాజరికంకన్న, దేవతలందరిపైనా ఇంద్రపదవిలాంటిది తగినపని. నిజంచెప్పు, నీవు ఆ నావలోని ధనరాసులకోసంకదా బయలుదేరింది?" అని నిలదీసినట్లు అడిగాడు ఏకాకి.

కుంభాండుడు నీళ్లు నములుతూన్నట్టు కాసేపు వూరుకున్నాడు. 'అవునా, కాదా?' అని ఏకాకి మరోసారి గద్దించి అడిగాడు. కుంభాండుడు నివ్వెరపడుతూ 'అవును,'





అన్నాడు. అప్పుడు ఏకాకి శాంతధోరణిలో యిలా అన్నాడు:

"ఈ ద్వీపంలో చాలా రోజులకిందట నేను ఐదారుగురు మనుషులను చూచాను. దుస్తుల తీరునుబట్టి వాళ్ళు నీలాగేవున్నారు. వాళ్ళూ నీమాదిరిగానే ఆ నావలోని ధన రాసులకోసం బయలుదేరినట్టుంది. నువ్వూ ఆ ముఠాకు చెందిన వాడివేనా?"

అసరికి కుంభాండుడికి ఏకాకి చూసిన మనుష్యులు ఎవరైందీ అర్థమైపోయింది. తనకన్న ముందుగా కుండలినీ రాజ్యం నుంచి బయలుదేరిన సమరసేనుడూ, అతడి సైనికులూ అయివుంటారని గ్రహించాడు. అలాంటి భావం కలగ్గానే అతడికి భయం, క్రోధంకూడా ఒక్కసారిగా కలిగినై. వాళ్ళను హతమార్చితేతప్ప లేకపోతే తనకు ప్రమాదం తప్పదని అనుకున్నాడు.

"వారెవరైందీ నాకు తెలుసు!" అన్నాడు కుంభాండుడు కోపంగా. "వాళ్లు యీ ద్వీపం చేరారని తెలిసే, నేను వాళ్ళను హతమార్చటానికి బయలుదేరాను. ధనాశా పరులైన ఆ ద్రోహులు తప్పక ఆ నావకోసం వెతుకుతూవుంటారనే నేను ఇటువచ్చాను. దారిలో మీరు తారసపడ్డారు!" అన్నాడు కుంభాండుడు నిజాన్ని కప్పిపుచ్చుతూ.




వాళ్ళ సంభాషణ వింటూవున్న చతుర్నేత్రుడు, ఇదే మంచి సమయమనుకొని—

"ఉలూకా, నరవానరా!" అంటూ దాక్కున్న చోటునుంచి బయటికి వురికాడు. సమరసేనుడూ, సైనికులూ బాణాలు ఎక్కుపెట్టి కుంభాండుడి మీదా, ఆటవికులమీదా అంబుల వర్షం కురిపించారు.

'ఉలూకా' అన్నమాట వినబడగానే ఏకాకి నివ్వెరపాటుచెంది చుట్టూ కలయ చూచాడు. బాణాలు తాకిన కొందరు ఆటవికులు అరుస్తూ కింద పడిపోయారు. కుంభాండుడు వున్నచోటునుంచి ఒక్క గంతువేసి కొండదిగువకు పరుగెత్తసాగాడు.







అలా ప్రాణభయంతో పారిపోతూన్న అటవికులనూ, కుంభాండుడినీ సమరసేనుడూ, సైనికులూ వెంబడించారు. చీకటి వల్ల బాణాలు గురిపెట్టి కొట్టేందుకు సైనికులకు వీలు కలగటంలేదు. 'అగండి, అగండి,' అంటూ కుంభాండుడు ఆటవికులను పారిపోకుండా నిలబెట్టాలని కేకలు వేస్తున్నాడు.

ఇక్కడ ఉలూకుడి పేరువిని అదరిపడిన ఏకాకి అంతలోనే స్తిమితపడి కత్తితిప్పుతూ ఒకటి రెండు అడుగులు ముందుకువేసి పళ్ళుకొరుకుతూ యిలా హుంకరించాడు:

"ఈసరికి నువ్వు వట్టి వాజమ్మవని తెలిసిపోయింది. మంత్ర తంత్ర విద్యల్లో లోకంలో నిన్ను మించినవాడు లేడని గర్వపడే నువ్వు, యీ మానవమాత్రుల బాణాల సహాయంతో నన్ను జయించాలని చూస్తున్నావు. నీ మిత్రులందరినీ నరికి పోగులు పెట్టేందుకు ఆ ఆటవికులు చాలు!"

చతుర్నేత్రుడు రెప్పవాల్చకుండా ఒక్క క్షణకాలం ఏకాకివంక చూస్తూ వూరుకున్నాడు. కొండకింద కుంభాండుడికేకలూ, ఆటవికుల అరుపులూ వినబడుతున్నవి. ఒకవేళ సమరసేనుడి కేమయినా ప్రమాదం కలగనున్నదేమో అన్న అనుమానం కలిగింది చతుర్నేత్రుడికి. అతడు వెంటనే అక్కడికి వెళ్ళటం మంచిదనుకొన్నాడు.

"ఏకాకీ, నీ వదరుబోతు మాటలకు జవాబుచెప్పే తీరిక నాకు లేదు. అంతేకాక మన భృత్యులమధ్య పోరాటంవల్ల కలిగే ఫలితంకూడా ఏమీలేదు. నీ కత్తులూ కటారులూ నన్నేమీ చేయలేవని నీకు తెలియంది కాదు. ఆరోజు వస్తుంది—నువ్వో నేనో తేలిపోతుంది! అప్పటివరకూ కేవలం మాటలవల్ల లాభంలేదు," అన్నాడు చతుర్నేత్రుడు.

ఆ వెంటనే తన కుచ్చుటోపీని చేతితో తాకాడు. మరుక్షణంలో అతడు సమరసేనుడికీ, కుంభాండుడికీ జరుగుతున్న





భయంకరమైన కత్తియుద్ధం దగ్గరకు వచ్చాడు. ఒకవైపున ఆటవికులు బరిశెలూ, ఈటెలూ విసురుతూ ముందుకు వస్తున్నారు. సమరసేనుడి సైనికులు తమ బాణాలతో వారిని గాయపరుస్తూ ముందుకు రాకుండా ఆటంకపరుస్తున్నారు.

ఇక సమరసేనుడూ, కుంభాండుడూ ఆ యుద్ధరంగం మధ్య కత్తులతో పోరాడుతున్నారు. అప్పటికి చంద్రోదయమై చక్కని వెన్నెల కాస్తోంది. గాయపడిన కొందరు ఆటవికులు ఆహాకారాలు వేస్తున్నారు. ఆ ప్రాంతమంతా అరుపులతో, కేకలతో ప్రతిధ్వనించిపోతోంది.

చతుర్నేత్రుడు యీ పరిస్థితుల్లో ఏమి చేయాలా అని ఆలోచిస్తున్నాడు. కొద్దిసేపట్లో అక్కడికి ఏకాకి వచ్చితీరుతాడని అతడికి తోచింది. కనుక యీ లోపలే కుంభాండుణ్ణీ, ఆటవికుల్నీ హతమార్చటం మంచిదనుకున్నాడు.

ఒకవేళ అది సాధ్యంకాకపోతే సమరసేనుణ్ణీ, సైనికులనైనా సురక్షిత ప్రదేశాలకు చేర్చి, తరువాత పరిస్థితి ఆలోచించటం వుత్తమం అనుకున్నాడు.

కాని యింతలో భయంకరమైన తోడేళ్ల అరుపులు వినబడినై. వెన్నెలరాత్రి ఆహారం కోసం బయలుదేరిన తోడేళ్ళగుంపు నెత్తురు వాసన పసికట్టి అటువైపే పరుగెత్తివస్తోంది.

తోడేళ్ళగుంపు అరుస్తూ కొండరాళ్ళ మించీ, చెట్లపొదల్లోంచీ పరుగెత్తిరావటం అందరూ చూచారు. యుద్ధంచేసి శత్రువులను హతమార్చేలోపల ఆ గుంపు తమనే హతమార్చగలదని అందరూ గ్రహించారు. వెంటనే పోరాడుతూన్న ఆటవికులూ, సైనికులూ పోరాటం మాని అక్కడినించి పారిపోసాగారు. కుంభాండుడూ, సమరసేనుడూ కూడా పోరాటం మాని వాళ్ళవాళ్ళ అనుచరులు పారిపోతూన్న దిక్కుకేసి పరుగు ప్రారంభించారు. —(ఇంకా వుంది)






# తప్పిపోయిన సిరి

ఒక చిన్నపల్లెలో మందరుడు అనే ఒక బీదయువకుడు ఉండేవాడు. అతడికి తల్లి తండ్రులుగాని, చుట్టపక్కాలుగాని ఎవరూ లేరు. జీవనోపాధికి అవసరమైన ఏ వృత్తి కూడా అతడికి అలవడలేదు.

ఒకనాటి రాత్రి భోజనాలయిన తరవాత పల్లెవాసుల్లో కొందరు పెద్దలు, లోకాభిరామాయణం మాట్లాడుకొనేందుకు ఒక రావిచెట్టుకింద కూర్చున్నారు.

మాటల సందర్భంలో పేదవాడైన మందరుడి ప్రస్తావన వచ్చింది. వాడికేదైనా వృత్తికల్పించి, వీలయితే ఒక ఇంటివాణ్ణి చేయటం పల్లెలో పెద్దలమయిన మన బాధ్యత అని నిర్ణయించుకొన్నారు.

ఆ మరుసటి రోజునుంచీ పల్లెలో వున్న నూరు కుటుంబాలవారికీ, కుటుంబానికి ఒక కావిడిచొప్పున చెరువులో నీళ్లు మందరుడు చేరబోయాలని అతడికి తెలియబరిచారు. ఇందుకు ప్రతిఫలంగా రోజూ ఒకరి ఇంట్లో భోజనం, అందరూ కలిసి అతడికి ఒక చిన్న యిల్లు కట్టిపెట్టటం ఏర్పాటు జరిగింది.

ఆనాటినుంచీ మందరుడు ఉదయం మొదలు సాయంకాలంవరకూ పల్లెలోని వారికి కావడితో నీళ్లు చేరబోస్తూండేవాడు.

కొన్నాళ్ల తర్వాత ఒకనాటి రాత్రి ఊరి పెద్దలందరూ రావిచెట్టుకింద కూర్చుని మాట్లాడుకుంటూంటే, మందరుడుకూడా కొంచెం ఎడంగా కూర్చుని వింటున్నాడు.

ఆ పల్లెలోవున్న అతి పురాతనమైన శివాలయాన్ని గురించి సంభాషణ ప్రారంభమైంది. ఆ ఆలయంలో ఒక శాసనం వుందనీ, అందులో అతి చిత్రమైన విషయం చెక్కబడివుందనీ ఒక వృద్ధుడు అన్నాడు.

ఆ శాసనంలో: ఎవడైనాసరే శివలింగానికి నూటయాభై బిందెల నీరు అభిషేకం చేస్తే చక్రవర్తి అవుతాడని లిఖించబడివున్నది.

టి. నరసింగరావు



చెరువునుంచితెచ్చే ఓపికా, పట్టుదలా లేకనే వాళ్ళంతా దాన్నిగురించి యీసడింపుగా మాట్లడారన్న నమ్మకం అతడికి కలిగింది.

"నాపనే నీళ్ళుమోయుటంగదా! నూట యాభై బిందెల నీరూ తెచ్చి ఆ శివలింగానికి అభిషేకం చేస్తాను. శాసనం ప్రకారం అయితే చక్రవర్తినౌతాను. లేదూ, ఇంత పుణ్యం అయినా రాకుండాపోతుందా? అనుకొన్నాడు మందరుడు.

ఇక మరుసటి రోజున పల్లెలోవాళ్ళకు నీళ్లు చేరబోయటం అవగానే, శివలింగానికి అభిషేకం ప్రారంభించాడు. ఒకటి... రెండు...మూడు...లెక్కకట్టి నీళ్ల బిందెలు శివలింగం నెత్తిన పోయసాగాడు.

సరీగా నూట నలభై బిందెల నీరు అభిషేకం చేసేసరికి మందరుడికి నిస్త్రాణ వచ్చింది. అయాసంతో కాళ్ళు తడబడ సాగినై. ఇంకా ఒక్క పదిబిందెల నీరేగదా కాస్త ఓపిక తెచ్చుకుంటేసరి అని దృఢ నిశ్చయం చేసుకొన్నాడు.

కాని, మరి ఎనిమిది బిందెల నీరు తెచ్చేసరికి అయాసం మరీ ఎక్కువయింది. అయాసపడుతూ అతడు శివలింగానికేసి చూసి, తరవాత తనను తను పరీక్షగా చూసుకొన్నాడు.

పెద్దల్లో ఒకడు ఆ శాసనం వట్టి కల్ల అని వాదించాడు. నూట యాభై బిందెల నీరు శివలింగానికి అభిషేకంచేస్తేనే చక్రవర్తి పదవి లభ్యం అయేట్టయితే—ఆ పని ప్రతివాడూ చేయగలడనీ, అందరూ చక్రవర్తులు కాగలరనీ వెటకారంగా మాట్లాడాడు.

కొంత వాదం జరిగింతరవాత తక్కిన పెద్దలుకూడా ఆ శాసనం కల్ల అయివుంటుందని అంగీకరించారు.

ఈ వాదోపవాదాలన్నీ విన్న మందరుడికి ఆరాత్రి నిద్రపట్టిందికాదు. అతి పురాతనమైన ఆ శాసనం కల్ల ఎలా అవుతుంది అనుకొన్నాడు. నూటయాభై బిందెల నీరు

"నూట నలభైఎనిమిది బిందెల నీరు అభిషేకం చేసినా నాలో చక్రవర్తి లక్షణాలు ఏమీ కనబడటంలేదు. అంత తెలిసిన పల్లె పెద్దలు ఈ శాసనం కల్ల అనటం నిజమే అయివుంటుంది. నేను వెర్రిబాగులవాణ్ణి కనకే అనవసరంగా ఇంత శ్రమపడ్డాను. సరే, అయిందేదో అయింది. ఈసారి కావిడి తెచ్చి ఆ రెండు బిందెలనూ శివలింగం మీద ఎత్తికొడతాను. నాకు అనవసరంగా ఇంత శరీరకష్టం కలిగించినందుకు ఈ శివలింగం బద్దలుకావలసిందే! తరవాత ఊళ్లోవాళ్లు నన్ను తిట్టనీ, కొట్టనీ, ఏమైనా సరే" అనుకుంటూ కోపంగా మళ్లీ చెరువుకు గబగబ వెళ్లి కావిడితో తిరిగి వచ్చాడు.

ముందు అనుకున్న ప్రకారం, పట్టరాని కోపంతో నీళ్లబిందెలు రెంటినీ ఎత్తి బలంగా శివలింగంమీద విసిరికొట్టాడు.

ఆ మరుక్షణంలోనే శివలింగం రెండుగా బద్దలై ఆ మధ్యనుంచి త్రిశూలం ధరించిన శివుడు ప్రత్యక్షమైయ్యాడు. మందరుడు భయంతో వణికిపోసాగాడు. అప్పుడు శివుడు:

"ఓరీ మందరా! నువ్వు మూర్ఖుడవు, మందబుద్ధివి! చేయదలచుకున్నది భక్తి శ్రద్ధలతో చేసి ఫలమును వాంఛించుట బుద్ధిమంతుల లక్షణము. నీ మూర్ఖచేష్ట వలన ఫలితాన్ని పోగొట్టుకొన్నావు. ఆ రెండు బిందెల నీటినీ భక్తితో అభిషేకించినట్టయితే నువ్వు నిజంగానే చక్రవర్తిత్వానికి అర్హుడ వయేవాడివి. సరే, ఇక యిక్కడినుంచి బయటికి వెళ్ళు!" అని మందలించాడు.

మందరుడు తల వంచుకొని ఆలయా న్నుంచి బయటికి వెళ్ళేందుకు వెనుదిరిగేం తలో బద్దలైన శివలింగమూ, శివుడూకూడా అక్కడినుంచి మాయమయారు.

మందరుడు ఈ సంగతి పల్లెపెద్దలకు చెప్పాడు. వారు ఆశ్చర్యపడి శివాలయానికి వచ్చిచూస్తే, అక్కడ శివలింగంగాని, శాసనం గల రాయిగాని కనబడలేదు.





# చతురుడు

పూర్వం ఒకానొక జమీందారీ గ్రామంలో జ్వాలాగ్ని అనే గొప్ప శిల్పి ఉండేవాడు. అతడికి నలుగురు పుత్రులు. వారిపేరు రామాగ్ని, భరతాగ్ని, రూపాగ్ని, కాలాగ్ని.

జ్వాలాగ్ని వృద్ధుడైపొయ్యాడు. అతడు వయసులో వుండగా కష్టపడి సంపాదించిన ధనమంతా సంసారాన్ని పోషించటంలోనే ఖర్చయిపోయింది. పుత్రులకేమో శిల్పవిద్య పట్టుబడలేదు. అన్నదమ్ములు నలుగురూ శిల్పవిద్యకు బదులు బంగారపు నగలూ అవీ చేయటం నేర్చుకున్నారు. కాని, తండ్రి బాగా సంపాయించుతున్నాడు గనక వారు ఆ పనికూడా శ్రద్ధగా చేసేవారు కాదు.

జ్వాలాగ్ని తను బాగా ముసలివాడినయిపోయాననీ, యిక అట్టేకాలం జీవించననీ అనుకొన్నాడు. ఇక కొడుకులైనా కష్టించి పని చేసుకోకపోతే, వాళ్ళూ ముందుముందు కష్టాలపాలు కావలసివస్తుందని తలచాడు.

ఒకనాటి రాత్రి జ్వాలాగ్ని పుత్రులు నలుగుర్నీ దగ్గరకు చేరబిలిచి:

"నాయనలారా, నేను ముసలివాణ్ణయాను. మరి ఎంతోకాలం జీవించను. మీకేమో నా శిల్పవిద్య పట్టుబడింది కాదాయె. మీరు నేర్చిన బంగారపు పనిలో వచ్చే చాలీచాలని ఆదాయంతో మీరెలా సుఖంగా బ్రతకగలరు?" అని అడిగాడు.

అందుకు పెద్దవాడైన రామాగ్ని: "నాన్నా, మీరు మమ్మల్నిగురించి ఏమీ చింత పెట్టుకోకండి. ఈ పనిలోనూ తెలివితేటలుంటే బాగా గిట్టుబాటు కాకపోదు. ఇక రేపటినుంచీ నగా నట్రా చేసేందుకు నా దగ్గరకు ఖాతాదారులు తెచ్చే బంగారంలో ఒకవంతు నాది, మూడువంతులు వారిది" అన్నాడు.

జ్వాలాగ్ని, పెద్దకొడుకు తెలివితేటలకు సంతోషించాడు. ఏదోవిధంగా లోకంలో

ఎస్. కాశయ్య

బ్రతుకుభారాన్ని మోయగలడనుకున్నాడు. తరవాత రెండవ కొమారుడు భరతాగ్నిని, రామాగ్నిని అడిగినట్టే అడిగాడు.

అందుకు భరతాగ్ని: "నాన్నా, నన్ను గురించి విచారపడకు. ఇక రేపటినుంచీ నాదగ్గరకు వచ్చే బంగారంలో సగం నాది, సగం యిచ్చినవారిది," అన్నాడు.

జ్వాలాగ్ని సంతోషించి మూడవవాడైన రూపాగ్నిని అడిగాడు. అందుకు రూపాగ్ని: "నాన్నా, మీకెందుకు యిలాంటి విచారం? రేపటినుంచి నాడగ్గరకు బంగారం ఎవరు తెచ్చినా, మూడువంతులు నాది, ఒక్క వంతు వారిది," అన్నాడు.

తరవాత కడసారివాడైన కాలాగ్నిని అడిగాడు. వాడు నవ్వి, "నాన్నా, మీరు మమ్మల్నిగురించిన దిగులేమీ పెట్టుకోక హాయిగా కాలం గడపండి. ధనం కావాలంటే కొల్లలుగా సంపాయించి మీ కాళ్ళ వద్ద పోయగలను. రేపటినుంచి నాదగ్గరకు ఎవడు బంగారం తెచ్చినాసరే అదంతా నాదే!" అన్నాడు.

జ్వాలాగ్ని, తన కొడుకులు ప్రయోజకులే అని సంతోషించాడు. కాని అతడికి కడసారివాడైన కాలాగ్ని మాటలు వింతగా కనిపించినై. నమ్మశక్యంగాకూడా లేవు.




ఇలాంటి అనుమానమే, ఆరాత్రి గస్తీ వాళ్ళతోపాటు, గ్రామంలో తిరుగుతున్న కొత్వాలుకుకూడా కలిగింది. గస్తీవాళ్ళ వేషంలో వున్న ఆ కొత్వాలు కిటికీపక్కనే పొంచి వుండి తండ్రీ కొడుకుల సంభాషణ అంతా విన్నాడు. కాలాగ్ని తన తండ్రికి చెప్పిన మాటను ఎలా నిలుపుకొంటాడో పరీక్షించాలనుకొన్నాడు.

తెల్లవారగానే కొత్వాలుదగ్గరనుంచి కాలాగ్నికి కబురు వచ్చింది. కాలాగ్ని వెళ్ళాడు.

"కాలాగ్నీ, నువ్వు మంచి పనివాడివని విన్నాను. నేను మన కేశవస్వామికి బం




గారు కిరీటం చేయించదలిచాను. ఆ పని నీకు ఒప్పగిస్తాను. ఒక నెలరోజుల గడువులో పని ముగించగలవా?" అని అడిగాడు కొత్వాలు.

"అయ్యా, నెలరోజులుకూడా ఎందుకు? సరీగ్గా యిరవైరోజుల్లో కిరీటం చేసితెస్తాను. బంగారం యిప్పించండి," అన్నాడు కాలాగ్ని.

కొత్వాలు ఆశ్చర్యపడుతూ న్నట్టు కాలాగ్నికేసి చూస్తూ, "ఇరవైరోజుల్లోనే కిరీటం చేసియివ్వగలవా? ఐతే నువ్వు మాంచి ఘటికుడివేయ్. ఇంకేం, పని మా ఇంట్లోనే ప్రారంభించు. స్వామివారి కిరీటం పని ప్రారంభం దగ్గరనుంచి, ముగిసే వరకూ దగ్గర వుండి చూడాలని కోర్కెగా వుంది," అన్నాడు కొత్వాలు.

ఆరోజునే కాలాగ్ని కిరీటం పని ప్రారంభించాడు. కొత్వాలు కుర్చీవేసుకొని కాలాగ్ని పక్కనే వుండి అతణ్ణి వేయికళ్లతో కనిపెట్టి చూస్తున్నాడు.

కాలాగ్ని పగలల్లా అక్కడ బంగారు కిరీటం పనిచేసి, రాత్రికి ఇంటికి రాగానే, ఇంట్లో ఒక పంచలోహాల కిరీటం పని చేస్తూండేవాడు. ఇదీ ఆకారంలో, చెక్కడంపనిలో అచ్చంగా ఆ బంగారు కిరీటంలాటిదే.

ఇరవైరోజులగడువూ అయేసరికి అక్కడ బంగారు కిరీటం, ఇంటిదగ్గర పంచలోహాల కిరీటం పూర్తిచేశాడు కాలాగ్ని. తన కనుగప్పి కాలాగ్ని బంగారం కాజేయలేకపోయాడని కొత్వాలు ధృవపరుచుకొన్నాడు.

"కాలాగ్నీ, నువ్వు అన్నప్రకారం పని ముగించావు. బాగానేవుంది. రేపు లేదు ఎల్లుండి స్వామివారికి ఈ కిరీటం అర్పించబోతున్నాను. ముందుగా కిరీటాన్ని కోనేటి జలంతో పవిత్రపరచాలిగదా. కనుక నువ్వు ఎల్లుండి సూర్యోదయమయేసరికల్లా రావలసింది," అని చెప్పాడు కొత్వాలు.



కాలాగ్ని సెలవు తీసుకొని ఇంటికి వెళ్లాడు. అరాత్రి తను తయారుచేసిన పంచలోహాల కిరీటాన్ని రహస్యంగా తీసుకుపోయి కోనేటిలో ఒకచోట దాచాడు. ఉదయమే కొత్వాలుఇంటికి వెళ్ళాడు.

కొత్వాలు బంగారు కిరీటాన్ని కాలాగ్ని చేతికి యిచ్చి, పెద్ద ఊరేగింపుతో కోనేటి దగ్గరకు వెళ్లాడు. అక్కడ కొత్వాలు, పక్కన చూస్తూవుండగానే కాలాగ్ని కోనేరులో దిగి, కిరీటాన్ని శుభ్రపరుస్తూన్నట్టు నీటిలో ముంచితీస్తూ, వీలుచూచుకొని బంగారు కిరీటాన్ని బురదలో తొక్కి, అక్కడే తను రాత్రి దాచిన పంచలోహాల కిరీటాన్ని బయటికి తీశాడు.



నీళ్ళ అడుగున జరిగిన ఈ మాయ ఎవరూ గుర్తించలేకపోయారు. పంచలోహ కిరీటానికీ, బంగారు కిరీటానికీ రూపంలో నూలువాసి తేడాఅయినా లేదు. కొత్వాలు శాస్త్రోక్తంగా కిరీటాన్ని కేశవస్వామికి అర్పించాడు. కాలాగ్ని ఎవరికీ తెలియకుండా ఆరాత్రే కోనేటికి పోయి బంగారు కిరీటం యింటికి తెచ్చుకొన్నాడు.

నెలరోజులు గడిచినై. కొత్వాలుకు ఏదో ఆలోచనమీద, కాలాగ్ని సంగతి గుర్తుకొచ్చింది. చేయశక్యంగాని పనులు చేస్తామని కొందరు ప్రగల్భాలు పలుకుతారెందుకా అనుకొన్నాడు. వృద్ధుడైన తండ్రి వద్ద కాలాగ్ని అలా మాట్లాడవలసిందికాదు అనుకొన్నాడు. అతణ్ణి ఒకమారు పిలిచి గట్టిగా కోప్పడటం మంచిదనుకొని కాలాగ్ని కోసం కబురు పంపాడు.

కాలాగ్ని వచ్చి కొత్వాలుకు నమస్కరించి చేతులుకట్టుకు నిలబడ్డాడు. అప్పుడు కొత్వాలు :

"కాలాగ్నీ! నిన్ను పిలిపించింది భూషించటానికీ కాదు, దూషించటానికి కాదు. ఒక సలహా యిద్దామని పిలిచాను. పెద్దలదగ్గిర ప్రగల్భాలు పలకకూడదు.

అందులోనూ దైవసమానుడైన తండ్రివద్ద అలాంటిది మహా పాపం. ఆనాటి రాత్రి నువ్వు మీ తండ్రితో చెప్పిన మాటలు విన్నాను. ఒకవంతూ, రెండువంతులూ, మూడువంతులూ కాదు, బంగారం అంతా నాదే అన్నావు! ఈ చేయించిన స్వామివారి కిరీటంలో ఒక్క చిన్నం యెత్తుకూడా నీ సొంతం చేసుకోలేకపోయావు," అన్నాడు.

కాలాగ్ని, కొత్వాలు మాటలు విని ఒక క్షణం మౌనం వహించి తరవాత వినయంగా యిలా అన్నాడు.

"అయ్యా, మీరు ఈ గ్రామానికి రాజు వంటివారు. నా ప్రాణవిత్తాలు మీచేతులో ఉన్నవి. నేను నాతండ్రికి చెప్పినది ప్రగల్భమో కాదో నిజంచెప్పాలంటే, నేను ఒకవేళ మీ దండనకు పాత్రుణ్ణి కావలసి వస్తుంది. క్షమించండి."

కాలాగ్ని యిలాంటి జవాబుయిచ్చేసరికి, కొత్వాలుకు అనుమానం కలిగింది.

"నిన్నేమీ దండించను. నిజం చెప్పు. అభయమిస్తున్నాను," అన్నాడు కొత్వాలు.

అప్పుడు కాలాగ్ని తనుచేసిన మోసం అంతా విప్పిచెప్పాడు. కొత్వాలు అంతావిని నవ్వుతూ:

"కాలాగ్నీ, నువ్వు దేవాంతకుడివి. స్వామివారికి పంచలోహ కిరీటం కానుక మంచిది కాదు. నీదగ్గిరవున్న కిరీటం ఎత్తు బంగారం యిస్తాను. అది నాకు ఇచ్చెయ్యి. నీ బుద్ధిసూక్ష్మతకూ, తెలివితేటలకూ నాకు చాలా ఆనందం కలుగుతోంది. నూరు మొహరీలు బహుమతీ యిస్తున్నాను." అన్నాడు.

కాలాగ్ని ఇంటికివెళ్ళి తనవద్దనున్న బంగారు కిరీటం కొత్వాలుకు తెచ్చి యిచ్చాడు. ఆయన యిచ్చిన కిరీటం బరువు బంగారం, బహుమతీ నూరు మొహరీలు తీసుకొని నవ్వుకొంటూ ఇంటికి వెళ్లాడు.





# రెండు మహావృక్షాలు



పూర్వం ఒకప్పుడు నారదుడు భూలోక సంచారం ముగించుకొని, మహావిష్ణువును దర్శించుకొందామని వైకుంఠానికి వెళ్లాడు.

మహావిష్ణువు, నారదుణ్ణి సాదరంగా ఆహ్వానించి—"నారదా! భూలోకసంచారం చేసివస్తున్నట్టున్నావు, విశేషాలేమిటి? అక్కడి ప్రజలు సర్వసంపదలు కలిగి తృప్తులై సుఖిస్తున్నారా? కలవారిలో దయాధర్మగుణాలూ, బీదలలో నియమనిష్ఠలు వర్ధిల్లుతున్నవా?" అని అడిగాడు.

అందుకు నారదుడు నవ్వుతూ తల వూపి—"దేవా, మీ ప్రశ్నకు ప్రత్యుత్తరం యివ్వటానికి ఎందుకనో నాకు మనస్కరించటంలేదు. తమరే స్వయంగా ఒకసారి భూలోకసంచారానికి బయలుదేరటం ఉత్తమం," అన్నాడు.

నారదుడు ఈవిధంగా జవాబు ఇచ్చేసరికి విష్ణుమూర్తికి చాలా ఆశ్చర్యం కలిగింది. ఇందులో ఏదో విశేషం వున్నదనీ, అందుకే నారదుడు తనను భూలోకసంచారం చేయవలసిందిగా కోరుతున్నాడనీ భావించాడు.

విష్ణువు నారదుణ్ణి వెంటపెట్టుకొని భూలోకసంచారానికి బయలుదేరాడు. ఇద్దరూ బాటసారుల వేషాలలో భూలోకానికి దిగివచ్చారు.

వారు ఒకానొక నగరం చేరి, అక్కడ కనిపించిన ఒక పెద్ద భవనందగ్గరకు వెళ్లారు. భవనద్వారాలు మూసివున్నవి. విష్ణుమూర్తీ, నారదుడూ ద్వారందగ్గరకు వెళ్ళి లోపల ఉన్నవారిని కేకవేసి పిలిచారు. లోపలనుంచి జవాబు రాలేదు.

తరవాత ఇద్దరూ మరొక ఇంటికి వెళ్ళారు. ఆ ఇంటి తలుపులు బార్లా తెరిచివున్నవి. వారు అక్కడకు వెళ్ళి—

"మేము బాటసారులం, ఆకలిగా వుంది. ఆతిథ్యం యివ్వగలరా?" అని అడిగారు.

డి. కాళేశ్వరరావు

అందుకు ఆ ఇంటివాళ్ళు చిరచిర లాడుతూ ఏ జవాబూ యివ్వకుండానే దభాలున తలుపులు మూసుకొన్నారు.

విష్ణువుకు ఈ ప్రవర్తన చాలా ఖేదం కలిగించింది. నారదుడు మాత్రం తల పక్కకు తిప్పుకొని ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు.

కొంతసేపు ఈ విధంగానే ఇద్దరూ మరి కొన్ని ఇళ్ళకు వెళ్లారు. 'బాటసారులం కరుణించండి' అంటూ ఆతిథ్యం కోరారు.

"మీకు ఆతిథ్యంకూడానా? పట్టెడు మెతుకులుకూడా పెట్టేదిలేదు. ఫోండి, ఫోండి!" అన్నారు కొందరు.

"పనిచేసుకు మాలాగే బతక్క, ముష్టిఎత్తు కోవటం ఎందుకు?" అన్నారు మరికొందరు.

చివరకు విష్ణుమూర్తీ, నారదుడూ ఒక పూరిగుడిసెదగ్గరకు వెళ్ళారు. గుడిసె బయట ఎవరూ లేరు.

ఇద్దరూ అక్కడకు వెళ్ళి గుడిసెలో ఉన్నవారిని పిలిచారు. వారి పిలుపు విని ఒక వృద్ధుడు బయటికి తొంగి చూచాడు. మరుక్షణం నవ్వుతూ బయటికి వచ్చి—

"రండి, నాయనలారా! మీరేదో బాట సారులలాగా వున్నారు. మేము బీదవాళ్ళ మయినా, ఉన్నంతలో మీకు ఆతిథ్యం యివ్వగలం," అంటూ ఆహ్వానించాడు.








నారదుడూ, విష్ణుమూర్తీ, ఆ వృద్ధుడి వెనకనే గుడిసెలోకి వెళ్ళారు. అక్కడ ఒక వృద్ధురాలు ఉన్నది. ఆమె ఆ వృద్ధుడి భార్య. అతిథులను చూస్తూనే లేచి ఒక చింకిచాప పరిచి నవ్వుతూ పలకరించింది.

"ప్రయాణబడలికతో వున్నట్టున్నారు. కాస్త ఓపిక పట్టారంటే భోజనం తయారు చేస్తాను, కూర్చోండి," అన్నది వృద్ధురాలు.

వృద్ధుడుమాత్రం ఆపూరిగుడిసెలో ఒక మూలనున్న కుండలూ అవీ వెతికి యిన్ని బియ్యం ఒక చేటలో పోశాడు. వాటిని భార్యచేతికి యిచ్చాడు. బయటికి వచ్చి గుడిసెమీద వున్న బీరతీగనుంచి నాలుగైదు కాయలు కోసి వాటినీ భార్యకు యిచ్చాడు. తరవాత అతిథులదగ్గరకు వచ్చి—

"భోజనానికి కొంత ఆలస్యం అవుతుంది. ఈలోపల ఫలహారం చేద్దురుగాని, కొంత స్తిమితంగా వుంటుంది. ఫలహారమంటే మరేం లేదు, మా పెరట్లో కాసిన దోసపండూ, యిన్ని గేదెపాలూ," అన్నాడు.

తరవాత అతడు ఒక దోసపండు మధ్యకు కోసి విష్ణువుకూ, నారదుడికీ చెరో ముక్కా యిచ్చాడు. కుండలో వున్నపాలను రెండు చిన్న ముంతలలో నిండుగా పోసి వారిముందుపెట్టాడు.

ఈ వృద్ధదంపతులు బీదవారైనా, వారు చేసే మర్యాదకూ, అతిథిసేవకూ విష్ణుమూర్తి చాలా సంతసపడ్డాడు.

"తాతా, మీకు పిల్లజెల్లలు లేరా? ఈ ముసలితనంలో మీ పోషణబాధ్యత వహించే బంధువులెవరైనా వున్నారా?" అని అడిగాడు విష్ణుమూర్తి. అందుకు వృద్ధుడు నవ్వుతూ—

"మాకు పిల్లలు లేరు. ఇక బంధువుల సంగతి చెప్పనే అవసరంలేదు. మాకు మేము తప్ప, ఈ లోకంలో నా అనేవారెవరూ లేరు. ఈ వృద్ధాప్యంలో ఏదో వున్నంతలో సరిపెట్టుకొంటూ కాలం గడుపుతున్నాం" అన్నాడు.






అంతలో విష్ణుమూర్తి ముంతలోని పాలు సగం తాగి కింద పెట్టాడు. అది ఎప్పటిలా నిండుగా తయారైంది. నారదుడు దోస ముక్కను సగం కొరికి చేతిలో పట్టుకు కూర్చున్నాడు. అదీ ఎప్పటిలా సగభాగం చెక్కు చెదరకుండా వుంది.

వృద్ధుడు యీ వింత చూచి అమితాశ్చర్యం పొందాడు. వీరెవరో దేవుళ్ళో, మహాపురుషులో అనుకున్నాడు. తన భార్య దగ్గరకు వెళ్ళి "అమ్మీ, చూచావా! మన ఇంటికి అతిథులుగా వచ్చినవారు సామాన్యులు కారు. ఇలాంటి వింత చూచాను," అంటూ భార్యకు చెప్పాడు.

ఇక ఆ వృద్ధురాలి ఆశ్చర్యానికీ, ఆనందానికి అంతులేదు. ఆమె చేతులు జోడించి, అతిథులు వున్న చోటుకువచ్చి—

"నాయనలారా! మీరు ఎవరైనదీ నాబోటి అజ్ఞానురాలు గ్రహించటం సాధ్యమయ్యేదికాదు. కాని, మీరు మహాపురుషులని తెలుసుకొన్నాను. మా యీ బీద గృహాన్ని పావనంచేసేందుకు వచ్చిన మీకు మా అజ్ఞానంవల్ల ఏదైనా లోపం జరిగితే క్షమించండి," అన్నది.

అందుకు విష్ణుమూర్తి నవ్వి, "అవ్వా, మీ అతిథ్యానికి చాలా ఆనందం కలుగుతోంది. పిల్లలూ, దగ్గిరబంధువులూ లేకపోయినా కనీసం ఐశ్వర్యమైనా వుంటే, మీరు కొంతలోకొంత అయినా సుఖించగలరు. కనుక మీ ఇద్దరూ మాతో గుడిసె బయటికి రండి," అన్నాడు.

విష్ణుమూర్తీ, నారదుడూ గుడిసెబయటికి వచ్చారు. వారివెనకనే వృద్ధదంపతులు కూడా బయటికి వచ్చారు. వారికి భయాశ్చర్యాలు కొలిపే వింత కనబడింది. గుడిసెముందు కనుచూపు మేర అంతా ఒకే ఒక మైదానంలా వుంది. అంతకు ముందున్న మహాభవనాలు అవీ ఒక్కటి కూడా కానరాకుండా అదృశ్యమయ్యాయి.

"మహానుభావుల్లారా, ఏమిటీ వింత? ఇక్కడ వున్న ఇళ్ళూ, చెట్టు చేమలూ ఏమయినాయి?' అని వృద్ధుడు అడిగాడు. అందుకు విష్ణువు—

"అవన్నీ నేల కలిశాయి. ఆకలిగొన్న వారికీ, మార్గాయాసంతో వచ్చినవారికీ పట్టెడన్నంగాని, కూర్చునేందుకు ఇంత చింకి చాపగాని ఇవ్వలేని ఆ గృహస్థులు మట్టి మీద ఉన్నా, మట్టిలో ఉన్నా ఒకటే. ఇప్పుడు చెప్పండి మీ కోర్కెలేమిటో?" అని అడిగాడు.

"మేము వృద్ధులం అయాము. మాకు వున్న కోర్కె అల్లా ఒక్కటే, మాకు మరణం ఒకేసారి కలగాలని. అంతవరకూ దైవపూజ చేసుకొనేందుకు ఇక్కడ ఒక దేవాలయం వుంటే మేము హాయిగా జీవితాలు గడపగలం," అన్నాడు వృద్ధుడు.

మరుక్షణంలోనే ఆ మైదానంలో చక్కని ఆలయం వెలిసింది. వృద్ధదంపతుల పూరిగుడిసెకు బదులు ఆ ప్రదేశంలో చక్కని భవనం ఏర్పడింది. అప్పుడు విష్ణుమూర్తి ఆ దంపతులను దీవించి—

"మీరే నిజమైన మానవమూర్తులు. మీరు జీవించినంతకాలం సుఖంగా జీవించి తరవాత ఆ ఆలయం ముందు గొప్ప వట వృక్షాలలా కలకాలం నిలబడతారు," అని చెప్పి నారదుడితోసహా అదృశ్యమయ్యాడు.

ఆ దంపతులు తమకు వచ్చిన ఐశ్వర్యంతో దానధర్మాలు చేస్తూ, ఆలయంలో పూజారులుగా చాలాకాలం జీవించారు. మరణానంతరంకూడా ఆలయం ముందే రెండు మహావట వృక్షాలై వెలిశారు.

ఆ వృద్ధదంపతుల ధర్మనిరతీ, భక్తి శ్రద్ధలూ చాలామంది గుర్తించారు. అక్కడ వున్న దేవాలయం సాక్షాత్తూ విష్ణువు నిర్మించినదే అని తెలిసిపోయింది. ఇక అప్పటి నుంచీ ఆ ప్రదేశం ఒక దివ్యక్షేత్రమై తీర్థ యాత్రికులతో కలకలలాడసాగింది.






# దుర్జనుల సఖ్యం

ఒక ఊళ్ళో ఒక సన్యాసి ఉండేవాడు. ఊరిచివర ఒక కుటీరంలో ఆయన నివసిస్తూ ఉండేవాడు. ఆయనభక్తులు కొందరు నిత్యమూ ఆయనకు పళ్ళూ, ఫలహారాలూ, భోజనమూ తెచ్చి సమర్పించి పోతూవుండేవారు. వీటితో ఆయన జీవిస్తుండేవాడు. ఒకవేళ ఏనాడైనా ఎవరూ రాకపోతే ఆరోజు సన్యాసి పస్తుండేవాడేగాని భోజనం లేదని విచారించేవాడుకాడు. సన్యాసి అప్పుడప్పుడూ ఉపవాసాలుంటున్నాడని తెలిసి ఒక భక్తుడు గేదెనొకదానిని తెచ్చి సన్యాసికిచ్చాడు. అదికూడా ఆ కుటీరంలోనే ఉండి సన్యాసికి పాలిస్తూఉండేది.

సన్యాసికుటీరంలో ఉన్న గేదెను కాజెయ్యాలని ఒక దొంగకు ఆలోచన కలిగింది. ఇదేమంత కష్టసాధ్యమైన పని కాదు. కుటీరం ఊరిచివర ఉన్నది. దానికి పెద్ద రక్షణ ఏమీలేదు. ఆఖరుకు తలుపుకు గొళ్ళెంకూడా లేదు. సన్యాసి నిద్రించే సమయంలో లోపల జొరబడి గేదెను విప్పి నిశ్చింతగా తోలుకుపోవచ్చు. అందుచేత ఒక చీకటిరాత్రి దొంగ, సన్యాసి కుటీరానికి బయలుదేరాడు.

దారిలో దొంగకు మరొకడు తటస్థపడి వెంట రాసాగాడు.

"ఎవరవు నువ్వు? నావెంట ఎందుకు వస్తున్నావు? నేను వేరే పనిమీద పోతున్నాను. నీ దారిన నువు పో!" అన్నాడు దొంగ.

దానికా రెండోమనిషి, "నేను భూతాన్ని. ఊరిచివర కుటీరంలో ఉన్న సన్యాసిని చంపటానికి పోతున్నాను. ఈ సన్యాసి ఈ వూరికి వచ్చిందిమొదలు జనం మంచిగా ఉంటున్నారు. అందుచేత నా వ్యాపారం బొత్తిగా అడుగంటింది. ఊళ్లో అన్యాయాలూ, అక్రమాలూ, దౌర్జన్యాలూ లేకుండా

పి. లక్ష్మీపతి

పోయాయి. అందుచేత ఈ సన్యాసిని చంపి ఊరిమీద మళ్ళీ నా పెత్తనం సాగించుకుంటాను. నీ ప్రయాణం ఎందాకా?" అని అడిగాడు.

"నా వృత్తి దొంగతనం. నేనూ ఆ సన్యాసి కుటీరానికే పోతున్నాను. కాని నా ఉద్దేశం సన్యాసిని చంపటంకాదు. ఆ సన్యాసికొక భక్తుడు పాడిగేదె నొకదానిని ఇచ్చాడు. దానిని దొంగలించబోతున్నాను," అన్నాడు దొంగ.

భూతమూ దొంగా సన్యాసికి హానిచేద్దామని ఒకేచోటికి పోతున్నారుగనక, వారికి సఖ్యం కుదిరింది. స్నేహితుల్లాగా చేతులు కలుపుకుని వారు అర్థరాత్రివేళ సన్యాసి కుటీరం చేరారు. ఎక్కడా చరిచప్పుడూ లేదు. సన్యాసి కుటీరంలోపల నిద్రపోతున్నాడు.

దొంగ తనలోతాను ఈవిధంగా ఆలోచించుకున్నాడు:

"ముందుగా ఈ భూతం సన్యాసిని చంపబోయేపక్షంలో సన్యాసి అరిచి అల్లరి చేసినట్టయితే నలుగురూ వస్తారు. అతరవాత నేను గేదెను దొంగలించటం సాధ్యపడదు. అందుచేత నేనే ముందు నా పని ముగించుకోవటం మంచిది. తరవాత భూతం దానిచావు అది చస్తుంది. నాకేం!"



అదేసమయంలో భూతంకూడా తనలో ఇలా ఆలోచించుకోవటం మొదలెట్టింది.

"ఈ దొంగ ముందుగా గేదెను దొంగిలించటానికి యత్నించినట్టయితే గేదె అరవవచ్చు. సన్యాసి లేస్తాడు, కేకవేస్తాడు. నలుగురూ వస్తారు. అప్పుడు నేను సన్యాసిని హత్యచేయుటం సాధ్యంకాదు."

పైకి భూతం దొంగతో ఈవిధంగా అన్నది: "తమ్ముడూ, ముందు నేను సన్యాసిని చంపేస్తాను. ఆతరవాత నువ్వు నిశ్చింతగా గేదెను తోలుకుపో. నిన్నడ్డేవారే ఉండరు!"

దానికి దొంగ, "అలాకాదు, అన్నా. ముందు నన్ను గుట్టుచప్పుడు కాకుండా గేదెను తోలుకుపోనీ. తరవాత నువ్వు సన్యాసిని యథేచ్ఛగా చంపుదువుగాని. నాది చాలా చిన్నపని!" అన్నాడు.

ఇద్దరూ వాదించుకోసాగారు. వాదన తగువుగా మారింది. మొదట రహస్యంగా మాట్లాడుకున్నవారు క్రమంగా గొంతు ఎత్తి 'నేను ముందు అంటే నేను ముందు' అని అరవసాగారు. అది రానురాను పెద్ద కేకలకిందికీ పెడబొబ్బలకిందికీ మారింది.

చివరకు దొంగ ఎలుగెత్తి, "ఏమయ్యోయ్, సన్యాసీ! ఇదుగో భూతంవచ్చింది చూడు, నిన్ను చంపటానికి!" అని అరిచాడు. భూతం అంతకన్న కోపంగా, "ఇదుగోనయ్యోయ్, సన్యాసీ, దొంగ! నీ గేదెను కాజేస్తాట్ట!" అన్నది.

ఈ అల్లరికి సన్యాసిమాత్రమేకాక చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళుకూడా కర్రలూ, కత్తులూ పట్టుకుని పరిగెత్తుకుంటూ వచ్చారు. ఆ వచ్చినవారిలో కొందరు పారిపోతూన్న దొంగను పట్టుకున్నారు. ఒక భూతవైద్యుడు భూతాన్ని అక్కడే బంధించి మారణహోమం చేశాడు.

దుర్జనుల మధ్య సఖ్యం ఎంతోకాలం నిలవదు.





# గాజు సింహము

త్రివిష్టపదేశంలో పూర్వం ఇద్దరు అన్నదమ్ములుండేవారు. వారి తండ్రి పోయాడు గాని తల్లి జీవించి ఉంది. వారిద్దరిలో అన్న యుక్తిగలవాడు, స్వార్థపరుడు. తమ్ముడు చాలా మంచివాడు, అమాయకుడు. అన్న సంపాదనమీదే ఎక్కువగా సంసారం సాగుతూ ఉండేది. తమ్ముడికి శరీరకష్టం చెయ్యటం తప్ప మరేమీ చేతకాలేదు.

కొంతకాలానికి తమ్ముడితో అన్న, "ఒరే తమ్ముడూ! నారెక్కల కష్టంమీద నిన్నెంత కాలమని పోషిస్తాను? కనుక నువు రేపే బయలుదేరిపోయి నీదారిన నువు బతికే ఉపాయం చూసుకో," అన్నాడు.

ఈమాటలు విని తమ్ముడు నొచ్చుకున్నాడు. అయినా వెళ్లటానికే నిశ్చయించాడు. వాడు తల్లివద్దకు పోయి జరిగిన విషయం చెప్పి, "అమ్మా, వెళ్ళివస్తాను," అన్నాడు. ఇదంతా వినేసరికి తల్లికి పెద్దకొడుకుపై పట్టరాని కోపంవచ్చి, "నిన్ను పోషించలేనివాడు నన్నుమాత్రం పోషిస్తాడని ఏమిటి? పద, నాయనా! నేనూ నీతోనే వస్తాను," అని తానూ బయలుదేరింది.

మర్నాడు తెల్లవారుజామునే తల్లీకొడుకూ బయలుదేరి కొంతదూరం పోయి ఒక కొండ వద్దకు చేరుకున్నారు. ఆ కొండదిగువను వారికొక ఖాళీఇల్లు కనిపించింది. ఈ ఇల్లున్న చోటికి అంతదూరాన ఒక పెద్ద బస్తీకూడా ఉన్నది. అందుచేత తల్లీకొడుకులు ఆ ఇల్లు ఆక్రమించుకుని ఆ రాత్రికి అక్కడే పడుకుని నిద్రపోయారు.

మర్నాడు ఉదయం చిన్నకొడుకు గొడ్డలి ఒకటి పట్టుకొని కొండమీదికి వెళ్ళి కట్టెలు కొట్టాడు. సాయంకాలానికల్లా పెద్ద మోపు తయారయింది. కుర్రవాడా కట్టెలమోపును బస్తీలో విక్రయించి, తాను తెచ్చిన డబ్బులు తల్లికి చూపాడు.

కె. జయలక్ష్మి




"అమ్మా, రోజూ ఇదేవిధంగా డబ్బు సంపాదిస్తాను. మనకు హాయిగా జరిగి పోతుంది," అన్నాడు వాడు తల్లితో.

మర్నాడు వాడు మళ్లీ కొండమీద మరొక ప్రాంతానికి వెళ్ళి కట్టెలు కొట్టుకుంటూ పోతూ ఉండగా ఒకచోట వాడికొక శిలా విగ్రహం కనిపించింది. సింహంరూపంలో అది రాతిలో మలిచిఉన్నది. దాన్ని చూసి ఆ కుర్రవాడు ఈ విధంగా అనుకున్నాడు:

"ఈ కొండకు ఇదే అధిష్ఠానదేవత అయి ఉండాలి. ఈ దేవత చలవవల్లనే నాకు కట్టెలూ, డబ్బులూ దొరుకుతున్నాయి. రేపు దీపారాధన చేసి దణ్ణం పెట్టుకుంటాను."



అదేవిధంగా వాడు మర్నాడు ఇంటి నుంచి ప్రమిదలూ, నూనే, వత్తులూ తెచ్చి, రాతిసింహం ఎదట దీపారాధన వెలిగించి, సింహంముందు సాష్టాంగపడి, "స్వామీ, తండ్రీ! రోజూ నాకు మంచికట్టెలు దొరికే టట్టు అనుగ్రహించు!" అని కోరుకున్నాడు.

మరుక్షణమే ఆ రాతిసింహం నోరు తెరిచి అడిగింది:

"నువ్విక్కడ ఏం చేస్తున్నావు?"

"స్వామీ! నన్ను మా అన్న ఇంటో నుంచి వెళ్ళగొట్టాడు. నేనీ కొండమీద కట్టెలు కొట్టుకుని నా తల్లిని పోషించు కుంటున్నాను. నీ దయవల్ల నాకు ఏ లోటూ కలగకుండా చెయ్యి," అన్నాడు కుర్రవాడు.

"మంచిది. రేపు యిదేవేళకు పెద్ద బుట్ట పట్టుకురా. నీకు కావలిసిన ధనం ఇస్తాను" అన్నది రాతిసింహం.

కుర్రవాడి ఆనందానికి మేరలేదు. వాడు రాతిసింహానికి మళ్ళీమళ్ళీ దణ్ణాలు పెట్టు కుని, తాను కొట్టిన కట్టెలు బస్తీకి తీసుకు పోయి అమ్మాడు. ఆ డబ్బుతోనే బుట్ట ఒకటి కొని ఇంటికి పోయి, మర్నాడు అదే వేళకు రాతిసింహందగ్గిరికి వచ్చి, భక్తితో నమస్కరించాడు. తరవాత "వచ్చాను, స్వామీ!" అన్నాడు వినయంగా.






"మంచిది, నేను చెప్పినట్టు చెయ్యి!" అన్నది సింహం. "బుట్టను నా నోటికింద పెట్టు. దాన్ని బంగారు మొహర్లతో నింపుతాను. కాని, జాగ్రత్త! అది నిండగానే నన్ను అగమని హెచ్చరించాలి. బుట్టమీది నుంచి ఒక్క మొహరు దొర్లి కిందపడినా నీకు కీడు కలుగుతుంది!"

రాతిసింహం ఆజ్ఞాపించిన ప్రకారం కుర్రవాడు బుట్టను దాని నోటికింద ఉంచాడు. సింహం నోటినుంచి బంగారు మొహర్లు ప్రవాహంగా వచ్చి బుట్ట నిండసాగింది. బుట్ట నిండబోతున్న సమయంలోనే కుర్రవాడు, "ఆగండి స్వామీ!" అన్నాడు. వెంటనే మొహర్ల ప్రవాహం నిలిచిపోయింది.

కుర్రవాడు రాతిసింహానికి తన కృతజ్ఞతను తెలుపుకుని, వెయ్యి దణ్ణాలు పెట్టుకుని, బుట్ట భుజాన ఎత్తుకుని కొండదిగి ఇంటికి వెళ్ళాడు. కొడుకు తెచ్చిన బంగారం చూసి మొదట తల్లి బెంబేరుపడింది. కాని వాడు జరిగినదంతా చెప్పినాక ఆవిడ ఆనందానికి మేరలేదు.

త్వరలోనే తల్లీ కొడుకూ ఆ ధనంతో కొంత పొలమూ, పశువులూ కొన్నారు. కొత్త ఇల్లు కట్టుకుని, వ్యవసాయం చేసుకుని, సుఖంగా కాలక్షేపం చేయసాగారు.

తమ్ముడు భాగ్యవంతుడైపోయాడనీ, ఆస్తి సంపాదించి తల్లిని సుఖపెడుతున్నాడనీ అన్నకు వార్త తెలిసింది. ఈ మార్పుకు కారణం ఏమిటో తెలుసుకుందామని తన భార్యతోసహా అన్న బయలుదేరి తమ్ముడింటికి వచ్చాడు. తమ్ముడు తన అన్నగారినీ, వదినెగారినీ ఎంతో ప్రేమగా ఆహ్వానించి గొప్పగా ఆతిథ్యమిచ్చాడు. తనకు డబ్బు వచ్చిన వైనమంతా అన్నకు కపటంలేకుండా చెప్పేశాడు.

ఇంత సులువుగా డబ్బు దొరికేటప్పుడు ఎందుకు పోనివ్వాలని అన్నకూ, అతని భార్యకూ తోచింది. అన్న ఆరోజే బస్తీకి




వెళ్ళి దుకాణాలన్నీ వెతికి పెద్ద ఇత్తడిపాత్రా, దీపారాధనకు రెండు కుందులూ కొన్నాడు. మర్నాడుదయం వాటితోసహా కొండ ఎక్కి సింహంముందు దీపారాధన చేసి, సాష్టాంగ పడి, "స్వామీ అనుగ్రహించు!" అన్నాడు.

"ఎవరు నువు ? నీకేం కావాలి ?" అని అడిగింది సింహం.

"ఒకప్పుడు తమరు నా తమ్ముడికి బంగారం దయచేశారు. నాకుకూడా అదే విధంగా దయచేయించాలి," అన్నాడు అన్న, వినయంగా.

"మంచిది. పాత్ర నా నోటిదగ్గిర పెడితే దాన్ని బంగారంతో నింపుతాను. కాని బంగారం దానినుంచి పొర్లి కిందపడితే ప్రమాదం. అందుచేత అది నిండగానే నన్ను ఆగమని చెప్పాలి," అన్నది సింహం.

అన్నకు ఆనందపారవశ్యంలో మాట కూడా రాలేదు. వొణుకుతున్న చేతులతో వాడు పాత్రను సింహం నోటికింద ఉంచాడు. అందులోకి బంగారు మొహర్లు ధారగా పడసాగాయి. ఎక్కువ మొహర్లు పట్టగలందులకు అన్న మధ్యమధ్య దానిని బాగా కుదిలిస్తూ వచ్చాడు. పాత్ర మూతిదాకా నిండినా కూడా వాడు ఆశాపాతకుడై సింహాన్ని ఆగమని చెప్పలేదు. మూతిమీద కుప్ప లేచాక చెబుదామనుకున్నాడు.

కాని మొహర్లు నున్నగా ఉండటంవల్ల ఒకదానిమీద ఒకటి పడి జారసాగాయి. చివరకు ఒక మొహరు పాత్రనుంచి కింద పడిపోయింది. ఆ క్షణంలోనే సింహం నోటినుంచి ధార నిలిచిపోయింది.

"నాయనా, ఒక పెద్దమొహరు కంఠంలో అడ్డుపడింది. నీ చేత్తో దానిని బయటికి తీసుకో!" అన్న మాటలు రాతిసింహం నోటినుంచి వెలువడ్డాయి. అన్న, ఆశతో తన చేతిని సింహం నోట్లోకి పెట్టాడు. ఇంతలోనే సింహం నోరు మూసుకుపోయింది. అన్న చెయ్యి అందులో చిక్కుకుపోయింది.

దానిని బయటికి తీసుకోవటానికి అన్న విశ్వప్రయత్నం చేశాడు, కాని ఫలితం కలగ లేదు. ఎంత వేడుకున్నా, ఎంత ఏడిచినా రాతిసింహానికి వినిపించినట్టే లేదు. పైగా పాత్రలో పడిన మొహర్లన్నీ రాళ్ళూ, మట్టి పెళ్ళలూ అయిపోయాయి.

చీకటి పడినా తన భర్త ఇంటికి రాక పోవటం చూసి అతని భార్య అతన్ని వెతుక్కుంటూ కొండమీడికి వెళ్ళి అతనున్న చోటికి చేరుకున్నది. అన్న జరిగినదంతా తన భార్యకు చెప్పాడు.

అదిమొదలు అన్నకు అతని భార్య రోజూ అన్నం పట్టుకుపోతూ ఉండేది. సంపాదించేవాళ్ళు లేక, ఉన్న ఆస్తి అమ్ముకుని బతకవలిసివచ్చింది.

కొన్ని నెలలు గడిచాయి. ఒక రోజు భార్య తన భర్తవద్దకు వచ్చి, "మన ఆస్తంతా అయిపొయింది. ఇంట్లో ఎరయే గానీ లేదు. అప్పుపెట్టేవాళ్ళుకూడా ఎవరూ లేరు. ఇక మనం తిండికికూడా మాడి చావవలిసిందే!" అన్నది.

ఈ మాటలు వినగానే రాతిసింహానికి పట్టరాని నవ్వొచ్చింది. అది నోరు తెరిచి "అహ్హహ్హ!" అని నవ్వసాగింది.

ఇదే మంచి సమయమనుకొని అన్న సింహంనోటినుంచి తన చేతిని బయటికి లాగేసుకున్నాడు. ధనం లేకపోతే మానె ప్రాణమైనా దక్కిందని సంతోషించాడు.

భార్యాభర్తలిద్దరూ అక్కడినుంచి బయలుదేరి నేరుగా చిన్నవాడి ఇంటికి వెళ్ళి జరిగినదంతా చెప్పుకున్నారు.

"దురాశ దుఃఖం చేటు అని పెద్దలు ఊరికే చెప్పారా? అయినా భయంలేదు. నేను డబ్బిస్తాను. దానితో పొలం కొనుక్కుని కాయకష్టం చేసుకుని సుఖంగా బతుకు," అని తమ్ముడు అన్నకు సలహా ఇచ్చాడు. చేసేదిలేక అన్న, తమ్ముడు చెప్పిన ప్రకారమే నడుచుకొన్నాడు.





# రాజును మించిన రైతు

పూర్వం గోల్కొండ రాజ్యంలో ఒక రైతుండేవాడు. ఒకనాడా రైతు తన పొలంలో విత్తులు చల్లుకుంటూండగా మామూలు దుస్తులతో నవాబు గుర్రంమీద అటుగా వచ్చాడు. కాస్త పొలంలో ఒంటరిగా పని చేసుకుంటున్న ఆ రైతు యోగక్షేమాలను తెలుసుకోవాలని నవాబుకు కోరిక కలిగింది. అందుచేత ఆయన గుర్రాన్ని ఆపి, "ఏం, రైతన్నా? వ్యవసాయం గిట్టుబాటుగా ఉందా?" అని అడిగాడు.

రైతు తలఎత్తి చూసి, "ఏం బాగులే, దొరా? పంట బాగా పండిన ఏడు ఎనభై రూపాయలు చేతికొస్తయి!" అన్నాడు. వాడు నవాబును గుర్తించనేలేదు.

"వాటిని ఏవిధంగా ఖర్చుచేస్తావు, రైతన్నా?" అని అడిగాడు నవాబు.

"ఏముంది, దొరా? ఇరవైరూపాయలు పన్నులకింద పోతయి. ఇరవై బాకీకింద చెల్లవుతయి. ఇరవై అప్పు పెడతాను. ఇక మిగిలిన ఆ ఇరవై రూపాయలూ గంగపాలు చేస్తాను," అన్నాడు రైతు.

ఈ సమాధానం విన్న నవాబుకు చాలా ఆశ్చర్యం కలిగింది.

"నాకు కాస్త వివరంగా చెప్పు, అన్నా! ఏంబాకీ చెల్లేస్తావు, ఎవరికి అప్పుపెడతావు, సొమ్ము గంగపాలెందుకు చేస్తావు? నాకేమీ అర్థంకాలేదు," అన్నాడాయన.

"దొరా, నాతండ్రిని పోషిస్తాను; అది అప్పు తీర్చటం. నా కొడుక్కి తిండిపెడతాను; అది అప్పుపెట్టటం. నా కూతురికి అన్నంపెడతాను; అది సొమ్ము గంగపాలు చెయ్యటం" అన్నాడు రైతు.

రైతు మాటలలో గల చమత్కారానికి నవాబు చాలా సంతోషించి, అతనికి కొంత ధనం ఇస్తూ, తాను నవాబునని బయటపెట్టి ఈవిధంగా అన్నాడు:

వి. సూర్యారావు

. "నీ మాటలలో చాలా నిజం వుంది. కాని నాతో అన్నమాటలు నా పరోక్షంలో మరెవరితోనూ అనకు. తెలిసిందా?" అని రైతును హెచ్చరించి, నవాబు తన గుర్రం మీద వచ్చినదారినే తిరిగి వెళ్లాడు.

దివాణం చేరుతూనే నవాబు తన అధికారుల నందరినీ పిలిపించాడు. అందరూ రాగానే ఇలా అన్నాడు :

"ఈ ఉదయం నేను గుర్రంమీద ఉత్తరంగా వెళ్ళాను. ఊరికి ఒకమైలున్నర దూరాన ఒక చిన్న పొలంలో ఒక రైతు విత్తనాలు చల్లుతూ కనిపించాడు. వాణ్ణి నేను పలకరించి, వ్యవసాయం గిట్టుబాటుగా ఉందా అని అడిగాను. దానికి వాడు, పంట బాగా పండితే ఎనభై రూపాయలు చేతికి వస్తాయన్నాడు. వాటిని ఏవిధంగా ఖర్చుచేస్తావని అడిగాను. ఇరవైరూపాయలు పన్నులు కడతాననీ, ఇరవై బాకీ తీరుస్తాననీ, ఇరవై అప్పు పెడతాననీ, ఇరవై గంగపాలు చేస్తాననీ ఆ రైతు నాప్రశ్నకు సమాధానమిచ్చాడు. ఆరైతుకు పెద్దచదువూ, సంస్కారమూలేవు. కేవలం పొలం దున్నుకునేవాడు. అయినా వాడింత భావగర్భితంగా మాట్లాడాడు. మరి మీరంతా చదువుకున్నవారు. కాని, మీలో ఏ ఒకరైనా వాడి మాటలలో గల



అంతరార్థం విప్పిచెప్పినట్టయితే ఒక జాగీరు బహుమతీ ఇస్తాను. ఆ జాగీరును ఎవరు సంపాదిస్తారో చూస్తాను.''

నవాబిచ్చిన సమస్యకు సమాధానం ఎవరూ చెప్పలేకపోయారు. ఒక అధికారి మాత్రం నవాబుతో మాట్లాడిన రైతును గురించి ఆరా తీసి, రైతును కలుసుకుని, "నువు నవాబుగారితో ఈవిధంగా అన్నావట. నీ ఉద్దేశం ఏమిటో నాకు వివరంగా తెలిపినట్టయితే నీకీ రూపాయలన్నీ యిచ్చేస్తాను," అని ఒక రూపాయల సంచి రైతుముందు పెట్టాడు.

ఆ రూపాయలను చూశాక రైతు రహస్యం దాచలేక అధికారికి తన మాటలు విప్పి చెప్పేశాడు. అధికారి నవాబువద్దకు వెళ్ళి ఆయన అడిగిన సమస్య విప్పాడు.

రైతు తన ఆజ్ఞను ఉల్లంఘించాడని నవాబు గ్రహించి, రైతును తన నౌకర్ల ద్వారా దివాణానికి పిలిపించి, "ఏం, రైతన్నా, నా మాటనెందుకు అతిక్రమించావు. ఇందుకు నీకు మరణదండన విధిస్తాను. ఏమి సంజాయిషీ చెప్పుకుంటావు?'' అని అడిగాడు.

రైతు భయపడలేదు. అతను ధైర్యంగా, "దొరా, నేను తమ ఆజ్ఞను ధిక్కరించలేదు. తమ సమక్షంలోనే నేను తమ అధికారికి ఆ రహస్యం చెప్పాను. నేనా సంగతి తమ అధికారికి చెప్పేటప్పుడు నా ఎదట నూరు రూపాయలున్నాయి. ప్రతి రూపాయి మీదా తమరున్నారు,'' అని జవాబిచ్చాడు. ఆ రైతు తనవద్దవున్న రూపాయిల్లోంచి మచ్చుకొక రూపాయి తీసి దానిమీదగల నవాబుబొమ్మను చూపాడు.

రైతు తెలివితేటలకు నవాబు మళ్ళీ ఆశ్చర్యపోయి, "అవును, నిజమే. రూపాయి మీద ఉన్నది నేనే!'' అంటూ రైతును చాలా గౌరవించి మరికొంత ధనం బహుమతి ఇచ్చి పంపేశాడు.





# అన్యాయం మంగలిది

పూర్వం బాగ్దాద్‌నగరంలో అలీ అనే మంగలి ఉండేవాడు. వాడు అందరు మంగళ్ళవంటివాడు కాడు. క్షౌరం చేయటంలో వాడికి గొప్ప నైపుణ్యం ఉండేది. బాగ్దాదులోని ధనికులూ, పలుకుబడి గలవారూ అలీచేతనే క్షౌరంచేయించుకునేవారు.

ఒకనాడు అలీ ఇంట్లో వంటచెరుకు కావలిసివచ్చింది. అందుచేత కట్టెలవాళ్ళ కోసం చూస్తూ అతను వీధివాకిట నిలబడ్డాడు. కొద్దిసేపట్లోనే కట్టెలుకొట్టేవాడొకడు గాడిదమీద కట్టెలమోపు వేసుకుని అటుగా వచ్చాడు. అలీ వాణ్ణి పిలిచి, "నాకు నీతో బేరమాడేటందుకు తీరిక లేదుగాని, ఆ గాడిదమీద ఉన్న కర్రయావత్తూ అయిదురూపాయలకిచ్చేస్తావా?" అని అడిగాడు.

బాగ్దాదులో వంటచెరుకుకు గిరాకీ హెచ్చు. సులువుగా దొరకదుకూడా. అయినా ఆ పేదవాడు, పెద్దబేరంగదా అని, సరేనన్నాడు. వాడు గాడిదమీది కట్టెలన్నీ దింపేసి డబ్బు అడిగాడు.

"గాడిదమీది కర్రయావత్తూ దించలేదు. గాడిదవీపున ఉన్న కొయ్యజీను మాట యేమిటి? అంతా కలిపే మాట్లాడాను," అన్నాడు అలీ.

"అదెట్లా?" అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

"ఆ జీనుమాత్రం కర్రడి కాదా? గాడిద మీద ఉన్న కర్రయావత్తూ నేను అయిదు రూపాయలకి బేరంచేశాను," అన్నాడు అలీ.

"ఇదేం బేరమండోయ్? దీనికి నేనెంతమాత్రం ఒప్పను," అన్నాడు కట్టెలవాడు.

ఇది విని అలీ కట్టెలవాడి దవడ వాయగొట్టి, కట్టెలూ జీనూకూడా లాక్కుని, పంపేశాడు. ఇలా దెబ్బలు తిన్న కట్టెలవాడు చెప్పలేని బాధతోనూ, దుఃఖంతోనూ

హెచ్. నారాయణమూర్తి



ఏడుస్తూ న్యాయాధికారివద్దకు పోయి జరిగినది విన్నవించుకున్నాడు. కాని ఆ న్యాయాధికారికి క్షౌరంచేసేది ఆలీయే కావటంచేత, ఆయన కట్టెలవాడి మొర వినిపించుకోలేదు.

కట్టెలవాడు ఇంకా పెద్ద న్యాయాధికారి దగ్గిరికి వెళ్ళి మొరపెట్టుకున్నాడు. కాని ఆయనకూ ఆలీయే మంగలి. కట్టెలవాడి మొర ఆయనకూడా పెడచెవి పెట్టాడు.

"నాకెవరూ సహాయంచేసేవాళ్లు లేరు. నా గతి ఇంతే!" అనుకుంటూ కట్టెలవాడు ఇంటిదారి పట్టాడు. వాడికి దారిలో ఒక ముసలివాడు ఎదురై, "ఏమిటి, నాయనా, అంత విచారంగా ఉన్నావు?" అని అడిగాడు. అందుకు కట్టెలవాడు ముసలివాడిదగ్గిర తన సొద వెళ్లబోసుకున్నాడు.

"దీనికే ఇంత బేజారైపోతావెందుకు? నువు మన ఖలీఫాదగ్గిరికి వెళ్ళి చెప్పుకో. నీకు న్యాయం జరగవచ్చు," అని ముసలివాడు కట్టెలవాడికి సలహా ఇచ్చాడు.

కట్టెలవాడు రాజభవనానికి వెళ్ళాడు. కొద్దిసేపట్లోనే వాడికి ఖలీఫా దర్శనం లభించింది. వాడు ఖలీఫాను సమీపించి ఆయన పాదాలవద్ద నేలను తాకి సలాము చేశాడు. ఖలీఫా వాడు వచ్చినపని విచారించాడు. కట్టెలవాడు జరిగినదంతా చెప్పాడు.

"న్యాయం ఆలీపక్షమే ఉన్నది. అయినా నీకు ధర్మంజరిగే ఉపాయం చెబుతాను. విను," అంటూ ఖలీఫా కట్టెలవాడి చెవిలో ఒక రహస్యం చెప్పాడు. కట్టెలవాడు ఖలీఫాకు మరొకసారి సలాంచేసి నవ్వుతూ ఇంటికి వెళ్ళిపోయాడు.

కొద్దిరోజులు గడిచాక కట్టెలవాడు మంగలి ఆలీవద్దకు పోయి, "నాకూ, నా నేస్తానికీ క్షౌరం చెయ్యటానికి ఏం పుచ్చుకుంటావు?" అని అడిగాడు.

"రెండు రూపాయలిస్తే మీ యిద్దరికీ క్షౌరం చేస్తాను" అన్నాడు ఆలీ.

"మంచిది. ముందు నాకు క్షౌరంచెయ్యి" అన్నాడు కట్టెలవాడు.

వాడి తల నున్నగా గొరిగేసినాక ఆలీ, "నీ నేస్తమెక్కడ?" అని అడిగాడు.

"బయట ఉండవచ్చు. లోపలికి తీసుకొస్తాను," అంటూ కట్టెలవాడు బయటికి పోయి తన గాడిదెను లోపలికి లాక్కొచ్చాడు

"ఇదుగో నా నేస్తం. క్షౌరం చెయ్యి," అన్నాడు కట్టెలవాడు.

"ఏమిటీ? గాడిదకు క్షౌరం చెయ్యమంటావా?" అన్నాడు ఆలీ మండిపడి. తక్షణం వెళ్ళిపోకపోతే చావగొడతానని బెదిరించాడు.

వెంటనే కట్టెలవాడు ఖలీఫావద్దకు పోయి మంగలిఆలీమీద ఫిర్యాదుచేశాడు. ఫిర్యాదు విని ఖలీఫా, తన భటులను పిలిపించి, "మంగలి ఆలీని కత్తులతోసహా తక్షణం పట్టుకురండి!" అని ఆజ్ఞాపించాడు. వాళ్లు ఆలీని పట్టుకొచ్చారు.

"ఈ మనిషి నేస్తానికి క్షౌరం చెయ్యటానికి ముందు మాటయిచ్చి తరవాత చేయనని నిరాకరించావుట, ఏమిటి కారణం?" అని అడిగాడు ఖలీఫా కోపంగా.

ఆలీ నేలకు వంగి సలాంచేస్తూ, "ఏలినవారు చెప్పినది నిజమేగాని, మనిషికి గాడిద నేస్తం కావటంగాని, గాడిదకు క్షౌరం చెయ్యటంగాని లోకంలో ఎక్కడైనా కద్దా?" అని అడిగాడు.

"నువ్వన్నదీ నిజమే. కాని జీనును వంటచెరుకుకింద కొనటంమటుకు ఎక్కడైనా కద్దా? వెంటనే ఈ గాడిదకు క్షౌరం చెయ్యి," అన్నాడు ఖలీఫా.

ఆలీకి తప్పలేదు. వాడు గాడిద శరీరానికి సబ్బునురుగు రాచి క్షౌరం చేస్తూంటే దర్బారులోనివారంతా విరగబడి నవ్వారు. ఆలీ పరువంతా బుగ్గిలో కలిసిపోయింది. నాటినుంచీ ఎవరూ అతడివద్ద క్షౌరం చేయించుకునే వారుకాదు.



# రత్నగోళం (అట్టచివరి బొమ్మ) - 6

వృద్ధుడైన బెస్తవాడు రత్నగోళాన్ని చేతపట్టి, మరలిపోదాంకదా అని గిరుక్కున ఇటువైపు తిరిగాడు. వాడు అనుకొన్నప్రకారం, క్షేమంగా ఇవతలకు దాటి రావలసిందే. కాని, నిద్రిస్తున్న ఒక పీతపైన వాడి కాలు పడటంతో, అది దాని డెక్కలతో వాణ్ణి పట్టుకొన్నది. అదే సమయంలో భూతసర్పం మేలుకొన్నది.

కాంతి కనబడకపోవటంతో భూతసర్పం జరిగిన సంగతి గ్రహించింది. పెద్దగా బొబ్బరించింది. ఇంతకుముందు ఎన్నడులేనంత భయంకరంగా సముద్రంలో పడి నీటిని కలచివేసింది. కెరటాలు అల్లకల్లోలంగా వున్నయి. బెస్తవాడు తప్పించుకు పారిపోబోయాడు. కాని, కాలు సాగలేదు. రత్నగోళాన్ని బట్టలలోపల దాచిపెట్టి, తను ఒక రాతిగుట్టచాటున దాక్కొన్నాడు.

భూతసర్పాలు ఎంతవెతికినా వాడు కనపడలేదు. అవి నిరాశచెందినై. ఐతే, కొంతసేపటికి అందులో ఒకటి బెస్తవాడి ఎదుటినుంచే ఈదుకొంటూ పోయింది. పోయేటప్పుడు దాని తోకదెబ్బ, దాక్కొనివున్న వృద్ధుడి బుజంమీద పడింది. ఆ దెబ్బతో వాడికి ప్రాణం కడపట్టినంత పనిఅయింది.

'కప్తానుగారూ! కప్తానుగారూ!' అని వాడు కేకలేసుకొంటూ ఓడ చేరుకొన్నాడు. కొనప్రాణాలతో వాడు చేరుకోగలిగేవరకే వ్యవధి ఉన్నది. వాడు తనుతెచ్చిన రత్నగోళాన్ని కప్తాను చేతిలో పెట్టి 'అయ్యా, నాపని ఐపోయింది. మీ వాగ్దానం మరచిపోకండి!' అంటూ, అక్కడనే పడిపోయాడు.

కప్తాను మాట తప్పనివాడు. వెంటనే ఆయన జపానుతీరానికి తన ఓడను మళ్లించి, చీనాదేశపురాణికి ఇష్టదేవత ఐన ఆ దేవి ఆలయానికి వెళ్లి, స్వయంగా తన చేతులతో తను, అమూల్యమైనటువంటి అపురూపమైనటువంటి రత్నగోళాన్ని పూజారిచేతికి కానుకగా ఇచ్చి, స్వదేశానికి వచ్చాడు.

చీనాదేశంలో దిగుతూనే కప్తాను, రత్నగోళాన్నిగురించి తను పడిన కష్టాలు, జరిపిన సాహసకృత్యాలు, వృద్ధుడైన బెస్తవాడు ఒక్కడే ప్రాణాలర్పించి ఈ రత్నగోళాన్ని రక్షించిన విధమూ, వాడికి తను ఇచ్చిన వాగ్దానం—అన్నీ పూసగుచ్చినట్టు రాణికి వినికిడిచేశాడు. రాణి వెంటనే ఆ బెస్తవాడి కొడుకును పిలిపించి, వాడిని ఎంతో గౌరవించి, గొప్ప తరిఫీదు ఇప్పించింది. తరవాత చక్రవర్తి ప్రయాణంచేసే ఓడకు కప్తానుగా నియమించింది. ★

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10లు

1954 డిసెంబరు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ అక్టోబర్ 7-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## అక్టోబరు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వెన్నెలలో మాట | రెండవ ఫోటో : తిన్నెలలో ఆట

పంపినవారు : యల్, శివరావు - కలెవరం, తెనాలి తాలూకా. (గుంటూరు జిల్లా)

బహుమతిమొత్తం రు. 10/ ఈ నెలాఖరులోగా పంపబడుతుంది



# వార్తలు-విశేషాలు

మనదేశంలో మొదటిసారిగా రైలుమార్గాలు వేయటం ఆరంభించినది 1853లో. అంటే మనదేశానికి రైళ్ళువచ్చి నూరేళ్ళు నిండాయి. ఈ సందర్భంలో ప్రభుత్వంవారు ఎగ్జిబిషన్ రైళ్ళను అనేకచోట్లకు పంపారు. ఈ రైళ్ళను లక్షలాది ప్రజలు చూశారు. ఈ ఎగ్జిబిషన్ రైళ్ళు మద్రాసులోకూడా కొన్నాళ్ళున్నాయి.

*　　　*　　　*　　　*

ప్రసిద్ధ కర్ణాటక గాయనీమణి అయిన శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మికి కేంద్ర ప్రభుత్వం పద్మవిభూషణ బిరుదం బహూకరించింది. అందుకుగాను ఆమెను గౌరవించటానికై మద్రాసులోని రసికరంజనీ సభ హాలులో ఒక సభ జరిగింది. సుప్రీంకోర్టు న్యాయమూర్తి టి. ఎల్. వెంకట్రామయ్యర్‌గారు ఆమె సంగీతాన్ని మెచ్చుకున్నారు. ఈ సభలో ఆమె పాటకచ్చేరికూడా చేసింది.

*　　　*　　　*　　　*

బ్రహ్మపుత్రానది వరదలవల్ల అపారమైన నష్టం జరిగింది. జల్పాయిగురీ జిల్లాలో వెయ్యి ఎకరాల తేయాకు తోటలు కొట్టుకుపోయాయి. పదిలక్షల పౌనుల తేయాకు నష్టమయింది. ఉత్తర బీహారులో 200 చదరపుమైళ్ళ ప్రాంతం నీటిలో మునిగిపోయింది. డిబ్రుగర్ నగరానికి చాలా నష్టం కలిగింది.

*　　　*　　　*　　　*

భారత ఉపాధ్యక్షులు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారి 66 వ జన్మదినోత్సవం సెప్టెంబరు 5 న జరిగింది. రాధాకృష్ణగారు గొప్ప వేదాంత పండితులు, రాజ్యాంగవేత్తలు.



గతించిన సెప్టెంబరు 2 గురువారంనాడు తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశంగారిచే ప్రారంభించబడింది. దీనికి చాన్సెలర్ మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి. ఆంధ్రలో ఇది రెండవ విశ్వవిద్యాలయం.

*　　*　　*　　*

రాగల అక్టోబరు 1 నుంచి నాగార్జున కొండవద్ద పురావస్తుశాఖవారు తవ్వడు మొదులుపెడతారు. ఇక్కడ దొరికే అమూల్యమైన పురావస్తువులను మరొకచోట భద్రపరుస్తారట. ఏమంటే నందికొండ ప్రాజెక్టు మూలంగా ఈ ప్రాంతం మునిగిపోతుందట.

*　　*　　*　　*

**1854** లో మన దేశంలోని తపాలాశాఖ **28,000** ఉత్తరాలనూ, బంగీలనూ బట్వాడా చేసింది. నూరేళ్ళ అనంతరం ఇదే శాఖ రోజుకు 70 లక్షల వస్తువులను బట్వాడాచేస్తున్నది.

*　　*　　*　　*

చాతీతలో 100 మీటర్ల రికార్డు లోగడ వాల్డిమిర్ మివాష్కిన్ అనే రష్యనుది. అతను 100 మీటర్ల దూరం 1 నిమిషం 11.2 సెకండ్ల కాలంలో ఈదాడు. ఇప్పుడా రికార్డును భగ్నంచేసి మొటాయికి మూరా అనే జాపనీస్‌వాడు కొత్తరికార్డు స్థాపించాడు. ఇతను 100 మీటర్ల దూరాన్ని 1 నిమిషం 10.6 సెకండ్ల కాలంలో ఈదాడు.

*　　*　　*　　*

ఆరు భారతీయ విశ్వవిద్యాలయాలనుంచి ప్రొఫెసర్లూ, విద్యార్థులూ కలిసి 26 గురుమంది రష్యా చూడటానికి సెప్టెంబరు ఆరంభంలో బయలుదేరివెళ్ళారు. సోవియట్ ప్రభుత్వం ఆహ్వానంపై వెళ్లిన వీరు రష్యాలో ఒక మాసం పర్యటిస్తారు.

*　　*　　*　　*

భారతీయ భాషలలో ప్రధాన పరిశోధనలకు ప్రోత్సాహం కలిగించేందుకు పూనా దక్కన్ కాలేజి పోస్టుగ్రాడ్యుయేట్ అండ్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌వారు వివిధ భాషలు నేర్పే పాఠశాలలు నెలకొల్పారు. వీటికి న్యూయార్కులోని రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్‌వారు ధనసహాయం చేస్తారు.



# చిత్రకథ



దాసూ, వాసూ వినాయకచవితి పండగనాటి సాయంత్రం ఒక తమాషా చేయ దలచుకున్నారు. 'ప్రొఫెసర్స్ దాసూ, వాసూలచే మాజిక్‌చేయబడును' అని కాయితాలమీద రాసి పంచిపెట్టారు. ఒక పాత టోపీ తెచ్చి, దానిలో బిస్కట్లు వేసి, పైన ఒక అట్ట కత్తిరించి అడ్డంపెట్టి మాజిక్‌చేసేందుకు తయారయారు.




కాని, పాపం టోపీని ఒకచోట దాస్తే, అందులోవున్న బిస్కట్లు తినేందుకు చేరిన ఎలుకసంగతి వాళ్లకు తెలీదు! 'ఇదిగో చూడండి. ఇందులో ఏమీ లేవు గదా? క్షణంలో బిస్కట్లు వస్తవి' అంటూ అట్ట కదిలించేసరికి, అందులో నుంచి ఎలుక బయటికి దూకింది. దాసూ, వాసూ తెల్లబోయారు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఇసుకతిన్నెలలో ఆట

పంపినవారు :
ఎల్. శివరావు - కలెవరం

